**కృతజ్ఞత:**

*

శ్రీ వీర సావర్కార్ విరచితమగు "భారత స్వాతంత్ర్య సమర" చరిత్ర "ఝాన్సీ రాణి" కృతికి మూలము.

*

జీవితసమరమున పరాజితుడనై వెన్నుచూపనున్న నన్ను ఉత్తేజ పరచి, ఆశయసిద్ధి కనువగు వాతావరణమును సృజించి కార్యోన్ముఖు నొనర్చినది నా ప్రాణమునకు ప్రాణము చిరంజీవి ముష్టి వేంకటశాస్త్రి; మాత్స్యపురి నివాసి.

*

నా అభ్యున్నతియే ప్రతిఫలమని భావించి కృతిపోషకత్వమున కుత్సహించి తనకు తానై గ్రంథముద్రణ భారమును వహించిన చిరంజీవి, నా తోడల్లుడు ప్రభల తల్పశాయి; నల్లూరు వాస్తవ్యుడు - భూస్వామి.

*

## : భూమికా వివరణ :

| | | | | |
|---|---|---|---|---|
| లక్ష్మీబాయి . . | ఝాన్సీ మహారాణి . . | వయసు | 22 | యేండ్లు * |
| మంధర . . . | మహారాణి బాల్యసఖి . | ,, | 24 | ,, |
| లక్ష్మణరావు పాండ్యా. | ఝాన్సీ ప్రధాని . . | ,, | 40 | ,, |
| బహదూర్ షా . . | ఢిల్లీ పాదుషా . . . | ,, | 80 | ,, |
| కుమార సింహుడు . | జగదీశ పురాధీశ్వరుడు . . | ,, | 80 | ,, * |
| మౌల్వీ అహమ్మదు షా. | ఫైజబాదు తాలుక్దార్ . . | ,, | 70 | ,, |
| తాంతియా తోపే . . | పీష్వాల సేనాపతి . . | ,, | 43 | ,, * |
| శ్రీమంత్ నానా సాహెబ్. | పీష్వా . . . . | ,, | 33 | ,, * |

* చారిత్ర కాధారము గలదు.

# ఝాన్సీ రాణి

ప్రథమాంకం — ప్రథమ రంగం

[విప్లవ ప్రచార శాఖాధిపతి మౌల్వీ అహమ్మద్‌షా ఉన్మాదిరూపంలో పర్యటిస్తూంటాడు.]

మౌల్వీ:- బ్రహ్మావర్త రాజప్రాసాదమున విప్లవ బీజము నాటబడినప్పుడే భారతదేశమున శేషించిన స్వార్థము సమసిపోయినది. ప్రాణరక్షణకై, స్వాతంత్ర్యసమరనేత శ్రీమంత్ నానా సహాయమునర్థించిన ఆంగ్లేయులు, భారతసైనికులు అర్థలోభులని విశ్వసించుట సమంజసముకాకపోదు. దేశద్రోహులను సృష్టించుటలో ఆంగ్లులది అందెవేసిన చేయి. ఏబదివేల రూప్యములు కాదు అవధదేశ మెల్ల పారితోషికమైనను నను బంధించు నీచుడు వీరభారతమున గోచరింపడు... (ఆలకించుట నభినయించి) అలజడి వినిపించుచున్నది. పట్టణసమీపమునకు చేరితిమి కాబోలు. ఓ... ఎవరో యిటే వచ్చుచున్నారు. దేశక్షేమము నెంచి తిరిగి నేను ఉన్మాదిని కావలెను.

(ఉన్మాదాన్ని నటిస్తూ సైనికునివలె అడుగువేస్తూ)

రైట్, లెఫ్టు; రైట్, లెఫ్టు; రైట్, లెఫ్టు; రైట్
రైట్, లెఫ్టు; ..

గులాము నండీ ! గరీబు నండీ !
సలాముచేస్తా సాహెబ్ లోగ్ !
భలా కరోతుం భాయీ లోగ్ ! ...గులాము...
ప్రాణం కోసం, బోనం కోసం
మానా న్నిట్టే వదిలేస్తా; వి
జ్ఞానా న్నిట్టే దులిపేస్తా
పరువు ప్రతిష్టలు వంశగౌరవం
ప్రలాపములుగా చాటిస్తా ! ...గులాము...

ఝాన్సీ రాణి

దేముళ్లంటూ దేశం అంటూ
దేవుళ్లాట్టం వృథా వృథా!
మతం మారితే గతం మరచితే
మనమే ప్రభులం గదా సదా! ...గులాము..

[ఎదురుగా వచ్చేమనిషి ఆగి, విని, సార్థకంగా తలపంకించి కదులుతాడు]

కొడితే తిడితే పడాలిరా
సెహతా అనుకుని మనాలిరా
మనలో శౌర్యం మసైనప్పుడు
బ్రతికేమార్గం కనాలిరా . . . !! రైట్ లెఫ్టు...

[ఒకసైనికుడు ఆదారిన పోతూ ఉంటాడు. మాల్వీ ఆతనిని చూస్తాడు.]

గ్రాసంకోసం కృపాణం ఎత్తిన
దరిద్రులారా లేవండోయ్!
రోసం కలదని మీసం దువ్వి
భ్రాతృహననమున కురకండోయ్ !!

(నిష్క్రమిస్తాడు)

ప్రథమాంకం ద్వితీయ రంగం

[కాగడాల వెలుగుల్లో, కరవాలాల తళ్ తళ్ లలో కొన్ని పటాలాలు ఢిల్లీ మార్గాన పోతూంటాయి.]

హర హర హర మహాదేవ్ !
హర హర హర మహాదేవ్ !!

స్వాతంత్ర్యధ్వజ మరయండీ !
స్వధర్మసమరం జరుపండీ !
ఆత్మరుధిర తర్పణమున పవిత్ర
భారతధరిత్రి దనుపండీ ! ... హరహర . . .

ప్రథమాంకం

పరప్రభుత్వపు ప్రజాపీడనం
పటాపంచలై పోవాలి!
ప్రజాహితం వర్ధిల్లాలి!
దేశద్రోహులు ధర్మవంచకులు
ధరిత్రి తేరని పించాలి!! .... హర హర ...

(నిష్క్రమిస్తాడు)

## ప్రథమాంకం — తృతీయరంగం

[శ్రీమంత్ నానా; కాన్పూరు రాజప్రాసాదంలో. అజీముల్లా అతని ప్రక్కనే ఉంటాడు.]

అజీముల్లా: ప్రసహించిన రుధిరమునకు తామింతగ విచారించుట సమంజసముకాదు. దీనికి మూలము ఫరంగీల పరరాజ్యాపహరణోద్యోగము గాని మన వీర కుమారుల రక్తపిపాసకాదు. శాంతి సౌభ్రాతృత్వములు నాకాంక్షించు పవిత్రభారతము స్వాతంత్ర్యసమర మొనర్చుట, స్వార్థమునకు స్వస్తిజెప్పి ద్రోహ చింతను దగ్ధపరచుట యూనే గాని అన్యముకానేరదు. శ్రీమంత్! వారు తమపై నిలిపికొనిన విశ్వాసమునకు అపచారము జరుగలేదే! పరపాలన మంతరింపవలెనను ప్రజాభిప్రాయమును తాము పాటించిరి. ప్రజా వాంఛితమును మన్నించి సమర సారథ్యము వహించిరి. పట్టణమును విడిచి ప్రాణరక్షణార్థై వారు పర్విషనచ్చునని తమకు తామై ప్రకటించిరి. ... ఫరంగీల కది రుచింపలేదు. ప్రతిఘటింపనే వారు నిశ్చయించిరి. ఫలితము ననుభవించిరి. ఇందు పీష్వాల ప్రతిష్ఠ కళంకిత మైన దెచ్చట; శ్రీమంత్!

నానా: ... ఆంగ్లులు శూర శిఖామణు లనుకొంటిమి; అజీముల్లా! కాని ...

అజీ: నేటి తమ అభిప్రాయమును వీరభారత మేనాడో గ్రహింపవలసినది; శ్రీమంత్!... శౌర్యము వంచనము నాశ్రయింపదు.

నైచ్యమును కన్నతల్లి వంచన మనునది ప్రశిద్ధము. అట్టి నైచ్యమునకు పాల్పడిన ప్రాణులు శౌర్యరసోజ్వల మగుట ప్రకృతి విరుద్ధము.

నానా: కాని, వారి సంకల్పబలము...

అజీ: వజ్ర సదృశము శ్రీమంత్! వారు సాధింపసమకట్టిన దుర్ఘట కార్యము, యేతదాశయసిద్ధికి వా రాచరించిన అపకృతి గోచరింపవు.

నానా: అజీముల్లా!... వంచనమున పరాభవింపబడెన, శ్రీమంత్ పీష్వాల ప్రతాపము ప్రతీకారమున కుత్సహించుట లేదు.

అజీ: యావద్భారతమున నిది పంచారించుచున్నది; శ్రీమంత్! అదియే ఫరంగీల ప్రతిఘటనకు ప్రాతిపదిక మైనది.

నానా: శ్రీమంత్ పీష్వాలు ప్రతీకారవాంఛా పరాన్ముఖులుగాని, పారతంత్ర్యోపాసకులగు భీరులు కారు; అజీముల్లా!

అజీ: అదియే ఆ ఫరంగీల కగ్రాహ్యమైనది; శ్రీమంత్! ఇంతటి రక్తపాతమునకు నదియేకదా మూలము!

నానా: ... పరాభవఖిన్నులగు శ్రీమంత్ పీష్వాలు అసి బట్టటకును, పాదతాడిత భుజంగము పసిపట్టుటకును సామ్యము కన్పట్టదు; అజీముల్లా! ప్రతీకారవాంఛాదగ్ధమోనది భుజంగహృదయము. స్వధర్మ పునరుద్ధరణము, స్వరాజ్యప్రతిష్ఠాపనము, ద్రోహ నిర్మూలనము మహారాష్ట్రవీరుల సంకల్పము.

[అజీముల్లాతల పంకిస్తూ ఉంటాడు. అంతలో నొక భటుడు ప్రవేశిస్తాడు]

భటుడు: ప్రభువులకు జయము!

నానా: ఏమది...?

భటుడు: ప్రభు దర్శనార్థము మహాసేనానులు......

అజీ: (నానావంక తిలకించి, భటునిదిక్కు) సెలవైనది!

(భటుని నిష్క్రమణ)

నానా: శ్రీమంత్ పీష్వాల మహాసేనాని తాతియా సామర్థ్యమునకు యావద్భారతమును జోహారు లర్పించుచున్నది.

అజీ : ... నిస్సంకోచముగ; శ్రీమంత్!

నానా: పూర్ణస్వాతంత్ర్యసిద్ధికి కాన్పూరు పత్తనము పరితపించుచున్నది.

అజీ : ఔను; శ్రీమంత్! సంధికేతన దర్శనమున ప్రజ సంతుష్టి నందలేదు. శ్వేతజాతిని స్ఫురణకుదెచ్చు చిహ్నముసైతము ప్రజానీకము నుద్రిక్తపరచుచున్నది. ... నదీతటమున నటించు నావలు ఫరంగీల పలాయన మునకే నని గ్రహించిన మన రాజధాని ఆనంద తాండవ మొనర్చుచున్నది.

(తాతియా ప్రవేశించును)

నానా: తాతియా ....! నౌకాపరిశీలనము ....

తాతి: ముగిసినది; శ్రీమంత్! ఆంగ్లసమూహములే స్వయముగ పరిశీలించి పరితోషము నందినారు.

నానా: వారికి వలయు ఆహార పానీయములు ... ?

తాతి : సర్వము సమకూర్పబడినవి; శ్రీమంత్!

నానా: అజీముల్లా! పీష్వాల సందేశమును . . .

అజీ : ఊహించితిని; శ్రీమంత్!

నానా: సంధిపత్రమున పీష్వాల రాజముద్ర గలదను యథార్థమును మహాసేనానులు విస్మరింప రనుకొందుము!

తాతి : అంతటి అపచారమా శ్రీమంత్!

నానా: ఆయుధాగారములను వశపరచికొనిన అప్రమత్తతయే వారిని సురక్షితముగ అలహాబాదు చేర్చుటయందును ప్రదర్శితము కావలె!

తాతి : ఆజ్ఞ .... శ్రీమంత్! వారిని నదీతీరమునకు చేర్చు వాహనములు, అశ్వములు సర్వము సిద్ధముగ నున్నవి; కాని,

నానా: .... సందేహము .... ?

తాతి: భద్రగజారోహణమునకు ఆంగ్లసేనాపతి అంగీకరింపలేదు.

అజీ: .... కారణము .... ?

నానా: అజీముల్లా! అత డాంగ్లసేనాపతి. పరాజయశంక పోవమక పూర్వము శ్రీమంత్ పీష్వాల స్వర్ణమకుటమును పాదతాడన మొనర్ప సమకట్టిన వాడు. కాని, కాలము మారినది. అధికార చిహ్నములు అంతర్ధానమైనవి. పాలితవర్గమును ప్రాణభిక్షకై యాచింపవలసి వచ్చినది. ఆచరించిన పాపకార్యములకు పలాయనమే పరమార్థమైనది. ఇట్టితరి, దర్పమును ప్రదర్శించు భద్రగజారోహణమొనర్చుట అతనికేగాదు, ఆత్మగౌరవము గల సర్వులకును బాధాకరమే. ఏమందువు ......?
...... తాతియా! పరాజితుడైనను శాత్రవ వీరుని శ్రీమంత్ పీష్వాలు పరాభవింపరు. ఆతడు నిరపాయముగ నదీతీరమును చేరుటయే మా ఆశయము. ఇప్పట్టున అతని అభిమత మెద్దియైనను మేము మన్నింతుము.

[అజీముల్లా ఆశ్చర్యముతో నానావంక చూచును. బయటనుండి కోలాహలము వినిపించును. అందరు నటే వీక్షించుచుండ నొకభటుడు ప్రవేశించును.]

అజీ: ...... ఆ కోలాహలమేమి......?

భటు: ఇచ్చట చేరిన పటాలములు కొన్ని నదీతీరమునకు పర్విడు చున్నవి ప్రభూ!

నానా: (సాలోచనముగ) సర్వము నవగతమైనది; సేనాపతీ!...... కంపిలుచున్న శ్రీమంత్ పీష్వాల కీర్తి స్థంభము నిక మీ శక్తి సామర్థ్యములు చతురత మాత్రమే పరిరక్షింపగలవు.

తాతి: ......ఆజ్ఞ...... శ్రీమంత్! (నిష్క్రమించును)

నానా: అజీముల్లా! శతవర్షప్రాయమగు దాశ్యమునుండి మరొక జామున కాన్పూరు పత్తనము విముక్తి నందనున్నది. స్వాతంత్ర్యధ్వజ దర్శనము, శ్వేతజాతి పలాయనము విప్లవ సైనికనికాయము నుద్రిక్తపరచుట సాజము. ...... జృంభించిన విజయోత్సా

హాము ఉన్మాదముగ పరిణమించి పూర్వ వాగ్దానమును భగ్న పరచుట కూడ అసంభవము కాదు. అట్టి కళంకమును శ్రీమంత్ పీష్వాలు సహింపరు.

అజీ : ... యథార్థము ... శ్రీమంత్ !

నానా: ... శాంతి భద్రతల రక్షణమున జనరల్ తిక్కాసింగునకు మీరురు సాయపడుట భావ్య మని కోరుదుము!

అజీ : ఆజ్ఞ ... శ్రీమంత్ !

నానా: ... హింసా ప్రవృత్తి యేరూపమున తలసూపినను యిప్పట్టున దండనార్హమే యగును.

అజీ : గ్రహించితిని; శ్రీమంత్!

నానా: ... ఇక నాలసించుట ...

అజీ : ... సెలవు, శ్రీమంత్! (నిష్క్రమించును)

నానా: (అటునిటు పచార్లొనర్చుచు) నిన్నటి నిరంకుశప్రభులు నేడు దాసాను దాసులగుట; యెంతటి వైపరీత్యము! పతనము నందక వర్ధిలిన అధికార మదాంధులెవరు? పరమత ద్వేషము ప్రళయానలమై భస్మీపటల మొనర్పని దెవ్వని? ఉహుఁ! వీరభాగత కృపాణము దుష్టశిక్షణాభిరతిగాక ప్రతిహింసాపరమై నటించె ననుట వ్యర్థ ప్రలాపము.

(ఒకసిపాయి ప్రవేశించును)

సిపాయి: ప్రభూ!

నానా: విశేషము లేమి?

సిపాయి: సతీచౌడాఘట్టమును ప్రవేశించిన అలహాబాదు కాశీ పటాల ములు ఫరంగీల నూచకోత కోయుచున్నవి!

నానా: (సాలోచనముగ) ... సేనాపతు లేమైరి?

సిపాయి: ...మహాసేనానుల దర్శింపబోయిరి. ప్రభూ!

నానా: (గంభీరముగ) శ్రీమంత్ పీష్వాప్రభువుల హృదయము వ్రయ్య లౌచున్న దని మహాసేనానులకు నివేదింపుము.... ద్రోహులు

దండనార్హులే ... కాని ... నిరపరాధులగు వనితలు, పసిపిసుం
గులు క్షమాపాత్రులని వారి స్ఫురణకు తెచ్చితి మనుము ...
పొమ్ము......
(సిపాయి నిష్క్రమించును. నానా ఆవేశ పచార్లు చేయుచుండును.)

ప్రథమాంకం చతుర్థరంగం

[ ఝాన్సీరాణి లక్ష్మీబాయి, ఆమె చెలికత్తె మంధరయు సంభాషించుకొను చుందురు.]

రాణి: ... మంధరా! మహారాష్ట్ర ధర్మప్రతిష్ఠాపనాచార్యులు సమర్థ రామదాసులు ప్రవచించినదేమి ?

మంధర: తమకు తెలియని దేమున్నదమ్మా!

ధర్మ రక్షణ కనువుల ధారవ్రాసి
శత్రు నివహమ్ము జెండి మోక్షమును గనుము!
ఆర్యధర్మము పారతంత్ర్యమ్మునందు
నష్టిలదు సుమ్ము; గోరుము కృపాణమింక !! అని.

రాణి: మహాత్ముల మహోపదేశము వ్యర్థము కాలేదు గదా!

మంధర: అట్టి సంశయమునకేని తావులేదు తల్లీ!

రాణి: మన జీవిత సర్వస్వము - స్వాతంత్ర్యము - ఫరంగీల స్వార్థానల మున కాహుతియైనది. ... పవిత్రభారత వీరధర్మము ప్రాణ భిక్షకై పాశ్చాత్యుల నాశ్రయించినది. ... ఆంగ్లహృదయ జనిత ద్వేషానిలోద్ధూతమై హిందూమహమ్మదీయ ప్రసిద్ధమత ద్వయము సర్వనాశము నందనున్నది. ... మంధరా! ఈ ముహూర్తమున మనము పూరించిన విప్లవశంఖమును శంకించు వా రుందురా యని!

మంధర : ఉండకపోరు; తల్లీ! కాని, వారు భీరులని, మాతృద్రోహు లని ప్రజ యెరుంగును.

రాణి : మంధరా! ...... లక్ష్మణరావుపాండ్యాకు మన మెంతగనో ఋణపడి యున్నాము.

మంథర: తమ అభిమానవాక్యము వారికి గర్వకారణము కాగల దమ్మా!

రాణి: ఇది అభిమాన జనితముకాదు; మంథరా! యాథార్థము. ఆత్మ గౌరవ - పరాభవ సంఘర్షణమున వారిలో జనించిన విప్లవాగ్ని యేకదా నేటి శత్రువినాశనమునకు మూలము! ...మూర్తీభవించిన వంచనమును మోసపుచ్చి, అప్రమత్తులగు పాశ్చాత్య పాలకుల కనుగప్పి, సుషుప్తి నందిన స్వాతంత్ర్యేచ్ఛను పాలిత వర్గమున ప్రేరేపించిన శక్తిశాలి ఆతడే కదా! యాథార్థ్యము నెరుంగుటకు, గుణము నభినందించుటకు వలసినది అభిమానముకాదు; మంథరా! ఆర్ద్ర హృదయము.

...... పూర్వాపర పరిశీలన మొనర్పక అధికార గర్వమున డల్‌హౌసీ నెరపిన అపకృతి యెల్లగా పరిణమించినది!

...... బిడ్డలులేని అప్పారావు చేసికొనిన దత్తు శాస్త్రీయము కాకపోయినది. రఘోజీ భాన్స్లే దత్తు చేసికొనకుండుట దోసమైనది. వారి సమక్షమున మనమహారాజులు చిరంజీవిని స్వీకరించుట నచ్చకపోయినది. ... అందులకై సతారా నాగపూరుల హరించిరి. ఝాన్సీని కబళింప నువ్విళులూరుచుండిరి. ఎట్టి వంచనము ...? ఎంతటి నిరంకుశాధికము? ఇదంతయు మాకు తగువారసులు లేరనియే కదా! ఐన... మంథరా! పాప ... మీనాడు శ్వేతచిహ్నమేని శేషించినది లేదే! నూరేండ్లుగ వా రనుభవించిన అధికారము నకు వారసులెవ్వరు?

(మందహాసము)

మంథర: ఆంగ్ల ధర్మసూత్రముల మరచి మూడుదినములైనదమ్మా! ఇకపై భూతలము విశ్వేశ్వరునిది ...... సామ్రాజ్యము ఫాదుపాలది, అధికారము మా మహారాణిది. అదేనాకు తెలియును.

(గుడిగంటలు వినిపించును. మంథర రాణివంక సార్థకముగ పరికించును.)

రాణి: ......... మంథరా ........

(రాణి దారితీయును. మంథర అనుసరించును.)

## ప్రథమాంకం — పంచమరంగం

[జగదీశ పురాధీశ్వరుడు కుమారసింహుడు తన ఆలోచనా మందిరంలో పచార్లు చేస్తూ ఉంటాడు.]

కుమార్: ... ఆంగ్లజన మేధాసంపత్తి కిది తార్కాణ కాబోలు. పోరున విజయ మసాధ్యమని గ్రహించిన యీ ధీరులకు వంచనమే శరణ్యమౌట ఆశ్చర్యజనకము కాదు. ... దాశ్యజీవిత వారాసి బడిన వీరకుమారులు సైకతస్థలి జేర యత్నించుట నా కుహనా పాలకు లెవ్విధి సహింపగలరు! పరాధీన భారతమును శత్రునిర్ముక్త మొనర్ప కృతనిశ్చయులైన ధీర కిశోరసింహుల పవిత్రాశయము నెవ్విధి నా భీరు లూహింప జాలుదురు! మాతృదాస్యశృంఖలా విచ్ఛేదనోద్యోగ తత్పరు లా పర రాజ్యాపహరణోన్మాదుల కుద్రేకపూరితులుగను, నజ్ఞానతమోవృతాత్ములుగను గాక యన్యథా గోచరించుటెట్లు? ఆర్యధర్మ ప్రతిష్ఠాపనార్థ మాత్మ రుధిరతర్పణమున కువ్విళులూరు గురు కృపాణసందోహమా స్వీయభూనాథ శిరచ్ఛేదమున కుద్యమించుట? కల్ల. ఇయ్యది మోసకారుల మహదాశయము. అసంభవము. ... ప్రాణభీతి నీ భూతలేశ్వరు డరిపాదము లాశ్రయించు ననుకొనుట యథార్థవిషయజ్ఞాన విరహితమైన గావలె, లేదా, ఆత్మవంచన మైన గావలె. ... ఉహుఁ... ! ఎంతటి నైచ్యము!

(ప్రక్కనే ఉన్న గంటకొట్టును. భటు డొకడు ప్రవేశించును)

దివాన్‌జీకి మాసెలవైనది.

(భటుడు నిష్క్రమించును)

ఆంగ్లసేనాపతీ!

వ్యాధిగ్రస్థుడు, వృద్ధు డిల్లకెటు దీప్యత్ఖడ్గరాజమ్మునన్
సాధించుం బగయంచు నెంచితివి; మోసప్రక్రియంబట్టినన్
వేధింపం దలపోసి; తౌర! యిక మన్నింపన్ జుమీ! చూతు,వీ
క్రోధావిష్ట మృగేంద్ర మెవ్విధిని జిక్కుల్ వెట్టి చెండాడునో!

(దివాన్ ప్రవేశించి సవినయముగ నిలబడును. కుమారసింహు డటుగా తిలకించును)

… దివాన్‌జీ! మా శ్రేయము నెంచి పరితపించు ఆ ఆంగ్లసేనా పతికి సమాధానము …

దివాన్ : …… సెలవిండు ప్రభూ!

కుమార్ : (ఆలోచిస్తూ)

ఆహవమం దెదిర్చి విజయమ్ము గ్రహింపుడు; లేదయేని "దా సోహ" మటంచు పాదముల నంటుడు; వేరొక ఛాయబోయి వి ద్రోహము నెంతురా రుధిరతోయధి నేలెద; మింక నిందు మీ సాహస మెన్నికన్ గనుటొ, క్షాత్రము మాయది నిల్చుటో యగున్!

(దివాన్ గ్రాసికొనుట మానును. అది కుమార్ గ్రహించును)

ఏమది దివాన్‌జీ!

దివాన్: (కంపితుడై) … నాదొక మనవి ప్రభూ!

కుమార్: … ఏమని…?

దివాన్: వంచనమును వంచనమునసే భంగపరచుట రాజనీతిజ్ఞతను ప్రదర్శించుటయూగదా యని…

కుమార్: … దాని వలని ఫలము…?

దివాన్: సమరసన్నాహమునకు సమయము తద్వారా లభించుట…

కుమార్: (ఆలోచిస్తూ) అటుల కాని-చో…?

దివాన్: (సంకేహిస్తూ) అనవసర రక్తప్రవాహము ప్రభూ!

కుమార్: (కొద్ది యోచించి) ఐన…?

దివాన్: (తెప్పరిలి) … తమ ఆజ్ఞ; ప్రభూ!

కుమార్: … మీకు పో సెలవైనది!

(దివాన్ నిష్క్రమించును)

… వంచనమును వంచనమునసే భంగపరచుట; చక్కని ఉపాయము. … వృద్ధుల మనియు, వ్యాధిగ్రస్థుల మనియు నాతడే

అంగీకరించినాడు. … అదే కారణమున మే మీనాడు కోటను వీడుట అసంభవమని వ్రాయించుట భావ్యము కాకపోదు. ఊహుఁ…! ఆంగ్లశూరాగ్రేసరులారా! మీ మోసప్రక్రియ తెలుంగని అమాయకులు మీకు బలి కావలసినదే కదా!

స్వార్థమ్ములన్ జవిజూపి, స్వీయమత ప్రాశస్త్యమ్మునున్ మాపి, ప్ర
త్యర్థిన్ గొల్పి, క్షేమమీగరిమ సంస్థాపించి, యేకత్వమున్
స్పర్థల్ కల్పనజేసి త్రుంచి, యిటు దాశ్యమ్మందు బంధించి, కా
మ్యార్థముల్ గొని మమ్ము న్వ్యస్తులటు సేయన్ మీకు చెల్లెన్ భళీ!

(దివాన్ ప్రవేశించును)

దివాన్: … ప్రభూ!

కుమార్: (చకితుడై) ఓ … మీరా…?

దివాన్: … మన వేగులవారు….

కుమార్: ఆఁ …! ఏమని వార్త తెచ్చిరి?

దివాన్: దక్షిణద్వారమునకు కనుచూపుమేరలో.

కుమార్: … సైనిక సంఘర్షణము కానవచ్చిన దని కాబోలు!

దివాన్: చిత్తము.

కుమార్: … ఆ దిక్కునగల మన బలము….?

దివాన్: ఆ రాత్రికే దళములు మాత్రము స్థావరమేర్పరచుకొని యున్నవి ప్రభూ! పదాతిసర్గ మీపాటికే …

కుమార్: …… భావి కర్తవ్యము … ?

దివాన్: (తడబడుతూ) తా మీసరకు వారికి పంపనెంచిన సమాధానము సార్థకమొనర్చుట.

కుమార్: (మందహాసంతో) ధీరలక్షణ మన నది.

దివాన్: … తమ ఆదేశము నీసరకే సేనాపతుల కందజేయుటయైనది ప్రభూ!

కుమార్: (యోచిస్తూ) … జగదీశపుర ప్రాకార పంక్తి నిక నా గొఱ్ఱె పొటేళ్లు ఢీకొనవచ్చును.

(సమరసన్నాహాన్ని సూచించే భేరీనాదం)

దివాన్: ఈ ముహూర్తమునుండియు సంస్థానకోశాగారము స్వాతంత్ర్య యోధుల స్వాధీన మొనర్పబడినదని మా మాటగ చాటింపుడు. స్వధర్మప్రతిష్ఠాపనానంతరమే యీ ప్రథమయోధుడు కుమారసింహుడు విశ్రాంతి నందు ననికూడ వారికి నివేదింపుడు. ఖడ్గ ప్రయోగమునకు, శాస్త్రధర్మ ప్రవర్తనమునకు నింతకు మించిన సదవకాశ మీ సంస్థానమునకు సిద్ధింపనున్న యథార్థమును మా అభిప్రాయముగ సోదర ప్రజానీకమునకు మనవి సేయుడు.

... క్షణ క్షణ పరిణామమును నిక మీరు నివేదించుటసంభవము. స్వాతంత్ర్యపతాకావిష్కారమే యిక్కడ మన సమావేశమునకు సంకేతము.

(కోటలో కలకలము. వీరులకు హారతులిచ్చు భామినుల పాట)

దివాన్: సెలవు ప్రభూ!

(కుమారసింహుడు తలపంకించును. దివాన్ నిష్క్రమించును.)

...ర్: ... ఒకవంక సమరసన్నాహములు ... వేరొకవంక సంధి ప్రయత్నములునా! కుతంత్రమును ప్రయోగింపని కపటపాండిత్యమున కీనాడు స్థానమే లేదా? ఇదియే కాబోలు ఆంగ్లేయు లింతవరకు సాధించిన విజయమునకు మూలము! ఊహుఁ...? కుతంత్ర ప్రవర్తనమున నింతగ గడితేరిన యోధుల కుశాగ్రబుద్ధి యెంతటి అల్పతరమైనది? శతసృష్ఠని కుమారసింహుని బుద్ధిజాడ్య మూనహించుటయుం? కావచ్చును. కాని, ఖండితశాస్త్రనికర సందోహ మాలికాప్రహసనముననే కుమారసింహుడు స్వాస్థ్యము నందగలడని నా యూహించుటెట్లు? చిత్తవిభ్రమము కుమారసింహునకుగాదు; ఆంగ్లరాజనీతిజ్ఞులకు. ఆంగ్లకుశాగ్ర బుద్ధులారా!

కోటలు కూలిపోవు ననుకొంటిరి కావలె, మిమ్ము నెంచి; మీ
ఛాటికి భూధవుల్ బహువిధమ్ముల బారుట నెంచిరే మొ? యిం
కేటికి? మీ ప్రభుల్ దొలగ నీతఁడు, వీరకుమారసింహు; డు
గ్రాటవి జేరి యేని మిము నారటపెట్టక పో డెఱుంగుడీ!

(శంఖారావం వినిపిస్తుంది. వింటూ నిష్క్రమిస్తాడు)

**ప్రథమాంకం** **షష్ఠ రంగం**

[సైనికుడొకడు తన తల్లిపాదములకు మ్రొక్కుచుండును. ఆమె అతనిని లేవదీసి నుదుట కుంకుమబెట్టి, హారతినిచ్చును.
మరొక ముస్లింసైనికుడు భార్యనుండి సెలవుతీసికొనును. ఆమె అతనికి ఖడ్గము నందించును.]

తెరలో పాట :

౧. వీరగంధము నీయురమ్మున కోరి చిలికెద సోదరా!
వెన్ను చూపి రణమునందున నన్ను కలచుట తగదురా!
—వీరగంధము ...

౨. తల్లి ఋణము నీగు తనయు లెల్లరు రండి! సూర
ధర్మమెంచి వీరతాంబూలము గొనుడీ!!—తల్లి ...

3. రక్తతిలకమును ధరింపుమా!
రుధిర హారతిని గ్రహింపుమా!
ఝాన్సిని సధర్మసమరం లేదని ఫలంగుచే నన దురాశనిలుమా!!
—రక్తతిలకమును ... ...

హర హర హర మహాదేవ్ !!
(సైనికులు కత్తులుదూసి నిష్క్రమింతురు)

**ప్రథమాంకం** **సప్తమ రంగం**

(ఢిల్లీపాదుషా బహదుర్‌షా హుక్కా పీలుస్తూ ఉంటాడు. అతని మోమున గంభీరత, కార్యదీక్ష, యోచనామగ్నత గోచరిస్తై.)

**బహదుర్‌షా:** ... పవిత్రభారతమున నీ ఆంగ్లపిశాచీతాండవ మింకెన్ని నాళ్ళు? ప్రసిద్ధమతద్వయ సంఘర్షణము నాశించి, స్వార్థప్రపూరిత కృపాణమును ఝళిపించి యెంతకాల మీ పరమత ప్రచారకు లీ కర్మభూమిని వర్ధిల్ల గలరు?
వీరభారతము ప్రళయ మేఘాచ్ఛాదితమైనది. ప్రతిక్రియాపరమై శౌర్యవారాసి పరవళ్ళు త్రొక్కుచున్నది. స్వీయధర్మప్రతిష్ఠా

పన్నోన్ముఖమై సితాసిపరంపర తళత్తళ లీనుచున్నది. అగ్నిపర్వతములమాడ్కి యోధానీకము విజృంభింప నుత్సహించియు నిర్దిష్టసమయమునకై నిరీక్షించుచున్నది.

ఏ ముహూర్తముననే మహాగ్నిగోళము పెఠిల్లుమనునో తోచదు. .... విశ్వప్రళయ మాసన్నమైనది. విద్రోహిజన కంఠోద్గతారుణ రక్తధారాస్రవంతిని మా మాతృభూమి పునీతమై ఉజ్వలమై భాసిలనున్నది. దర్శనీయముగదా ఆసన్నప్రళయము!

(వేగుచున్న గంటకొట్టగా భటుడొకడు ప్రవేశించును)

భటుడు: ... అన్నదాతా!

బహా: సర్వసైన్యాధ్యక్షులకు మాసెలవైనది.

(సవినయముగ సైనికుడు నిష్క్రమించును. బహదుర్‌షా పచార్లొనర్చుచుండును. అంతలో భక్త్‌ఖాన్ ప్రవేశించును.)

భక్త్‌ఖాన్!

భక్త: ఖావింద్!

బహా: ... సమరసన్నాహ పరిణామ మెట్లున్నది?

భక్త: ఖావింద్! సర్వము సక్రమముగనే సాగుచున్నది. ఢిల్లీ పట్టణము స్వాతంత్ర్యయోధ పరివేష్టితమై క్షణక్షణ ప్రవర్ధమాన మగుచున్నది. మౌల్వీ అహమ్మద్‌షా పర్యవేక్షణమున ప్రచారసాధన మద్వితీయముగ నున్నది. అతడుమెట్టిన ప్రతిసీమయు అనంతకోటి వీరవరేణ్యుల కాలవాల మౌచున్నది.

జగదీశపురాధీశ్వరుడు కుమారసింహుడు ఆంగ్ల సైన్యాధ్యక్షుల జోహా ర్లందుకొనుచున్నాడు. ఆతని నాశ్రయించిన యోధవర్గము పరిమితము కానిచో యేనాడో మన మాతృభూమి స్వాతంత్ర్య జ్యోత్స్న విలసితమై యుండెడిది.

దక్కనునందు రంగోబాపుజీ; కాన్పూరున, నానా తాంతియా అజీముల్లాఖానులు; అయోధ్యయందు నిక్కిఖాన్ ప్రభృతులు నెల్లరు ప్రతాపమార్తాండులై భాసిలుచున్నారు. ఆలిఘర్,

రోహిల్‌ఖండ్, షహాజహాన్‌పూర్, అజీమ్‌ఘర్, ఫైజబాద్
కాళీఘట్టములు ఆంగ్లేయుల నాహుతిగొన్నవి.
కాళీఘట్టమున బంధింపబడిన అవధనవాబు అతని ప్రధాని,
వజీద్ ఆలీషా ప్రభుడు యింకనుకొ బందీలుగనె ఉన్నారు.

బహ: ఝాన్సి మహారాణి విషయమో?
ఆ మహారాణికి అడ్డేమున్నది; అన్నదాతా!

బహ: అచటిపాలనము అప్రతిహతమేకదా!

భ: ఔను ... అన్నదాత

బహ: ఇక, ఢిల్లీ స్థితి?

భక్త: అస్త్రాలందరును ఆయుధధారులై మొహస్సిన్ లా
కాబూల్ ద్వారములు సుశిక్షితభటవర్గముచే సురక్షితములు.
రక్షప్రాకార పునర్నిర్మాణము, కుత్యాంప్తిని మరఫిరంగుల
స్థాపన, సర్వము శక్తివంచనలేక జరిగిపోయినది. శాత్రవసైన్య
ప్రవేశము శంకింపబడిన తావులు మందుగనులచే నిక్షిప్తకృత
మొనర్పబడినవి. ఇకపై తమ ఆజ్ఞ ... అన్నదాతా!

బహ: స్వాతంత్ర్య పతాక నాశ్రయించిన యోధులు....

భక్త: సర్వవిధముల సుఖులే, అన్నదాతా!

(భటుడొకడు ప్రవేశించును)

బహ: జహాపనా! శత్రుశిబిరంనుంచి ఒక వార్తాహరుడు.....

పత్రమును అందియును. అతడు దానిని

.... నాదొక మనవి; అన్నదాతా!

బహ: సంకోచమున కవసరము?

భక్త: సందేహము క్షంతవ్య మన్నదాతా! విద్రోహచింత రాజవంగడ
మున ప్రవేశించిన దను వదంతి....

బహ: సర్వసైన్యాధ్యక్షులేనా యీ నివేదించుకొనునది!

భక్త: క్షంతవ్యుడ నన్నదాతా!

బహా: యీ శక్తి విహీనతకు మూలము?

భక్త: అనుమాన మింకను స్థిరపడలే దన్నదాతా!

బహా: మరి కర్తవ్యము ...?

భక్త: తాము అప్రమత్తులరై మెలగుటయే అన్నదాతా!

(సాకూతా ఆలోచనానిమగ్నుడై పరిశీలించుచుండును)

బహా: ... ఫరంగీల ఫిరంగిమోతల నూహించుచుంటిరా సైన్యాధ్యక్షులూ?

భక్త: ఫిరంగీమోతలుగా దన్నదాతా; వారి నీచభావతరంగ ఘోషను.

బహా: ఆ రాజనీతి విశారదులు వ్రాసినదేమని?

భక్త: ఏ ముండదు అన్నదాతా! విప్లవకారులు మిమ్ము వంచించిరని, ...... పరిస్థితి విషమించకపూర్వము విద్రోహుల నణచుటలో తాము వారికి సాయపడుట భావ్యమని .....

బహా: ... అంతియనా ...?

భక్త: ... విన్నవించికొనుటకే సిగ్గగుచున్న దన్నదాతా! సంస్థాన ప్రముఖులెవరో మా ప్రభువుల దురవస్థను వారికి నివేదించికొనిరట. అందుకు వారు మిక్కిలి విచారించిరట ...

బహా: ... మీ సందేహము నిరాధారము కాదన్నమాట ...! ఆఁ ...! ఆపైన ...?

భక్త: సింధ్ పాటియాలా నాభా సంస్థానములు మనపై కత్తిగట్టిన మాట మరువ రాదట. గ్వాలియర్ హైదరాబాదులు మనల నేవగించి కొనుట విస్మరింప రాదట.

బహా: ... తదుపరి ...?

భక్త: వారి మితిమీరిన నైచ్యము యీ తుది వాక్యమున ప్రతిబింబించుచున్న దన్నదాతా! ఢిల్లీ పాదుషాల వంశము సుస్థిరము కావలెనన్న ప్రస్తుత మీ సింహాసనమును ....

బహా: ... చాలు నీ కఠోరశ్రవణము ... !
భక్తఖాన్ .... !

భక్త: అన్నదాతా!

బహా: అర్హరీతిని వారికి సమాధాన మంపుడు.

భక్త: అటులనే; అన్నదాతా!

బహా: ఆహానమునకు సర్వము నాయత్తపరపుడు!

భక్త: ఆజ్ఞ; అన్నదాతా!

బహా: సంస్థానము నందలి ఆ విద్రోహి యెవరో....

భక్త: తేల్చికొందు నన్నదాతా!

బహా: తేల్చికొనుటయే కాదు, వానిని ఖండఖండములుగ చీల్చి వేయవలె.

(భక్తఖాన్ నిష్క్రమణము)

బహా: సందియమునకింక తావు లేదు భక్తఖాన్. ఇక మీ ప్రయత్నముల మీరు నిమగ్నులు కావచ్చును.

(సవినయముగ సలాము నర్పించి భక్తఖాన్ నిష్క్రమించును. అనంతరము బహాదుర్ షా కొలది సేపు పచార్లు సలుపు చుండును.)

## ప్రథమాంకం — సప్తమ రంగం

[ఒక బ్రిటిష్ జనరల్ తన గుడారంలో ఉగ్రుడై... హుక్కా పీలుస్తూ ఉంటాడు. ఒక సైనికుడు అతని పాదాలొత్తుతూ ఉంటాడు. అతని ప్రక్కనే నిలువబడి ఒక విద్రోహి ఎదుటవున్న సిపాయిల నుద్దేశించి ఉపన్యసిస్తాడు.]

ద్రోహి: సోదరులారా! ఇంతవరకు మన దొరవారు తమహృదయావేదనను మీకు వ్యక్తపరచుకున్నారు. వారి ఉప్పుతింటు న్న మీరు వారికే ద్రోహం చేశారని వినటానికి నాకే సిగ్గుగా ఉంది. మనలను నూరేండ్లుగా పెంచి పోషించిన ఆ ఆంగ్లసామ్రాజ్యాధీశ్వరులను యీనాడు మనం విశ్వసించక పోవటం మన కృతఘ్నతకు తార్కాణం. మన మాతృభూమికే తీరని కళంకం.

క్షణక్షణం పోట్లాడుకునే మనకు ప్రేమతత్వాన్ని బోధించి హిందూ మహమ్మదీయ సఖ్యతను స్థిరతరమొనర్చి, శాంతి సౌఖ్యాలను ప్రసాదించి, ఉద్యోగాలు కల్పించి, భారాన్నంతనీ వహిస్తున్న గౌరవనీయులకు ద్రోహాన్ని తల పెట్టటం నీచాతి నీచమైన పాపం. దేశమనీ, దేవుళ్లనీ వెర్రిసిద్ధాంతాల జోలికి పోకండి. అవి మీకు అన్నం పెట్టేవి కావు. మీలో ఉన్న తిరుగుబాటువారులను పట్టి యియ్యండి! వారిని చక్కగా శిక్షిద్దాం. ఆ పితూరీదారులకు మన ప్రభువులు ప్రసాదించే శిక్ష ఆదర్శ ప్రాయంగా ఉంటుంది. మన భారతీయ ప్రతిష్ఠకు అది మకుటంలా ప్రకాశిస్తుంది. మన కృతజ్ఞత కది అమరచిహ్నంగా ఉంటుంది.

ఇంతకూ మన దొరవారన్న ముక్కలు మీకు తెలిసి ఉండవు. అది . . . . మీకు వారు చేసిన ఉపదేశం. . . . మనపూర్వజీవితాన్నంతనీ మూడుముక్కల్లో వారు చక్కగా వ్యక్తీకరించారు. అది యిది. . . . .

జ్ఞానము సున్న, శిక్షణమునాస్తి, ప్రతాపముప్రాజ్య, మట్టి మీ
కై నిజరాజ్య నిర్వహణ మందలి తళ్కుల గ్రమ్మరించి, ప్ర
జ్ఞానిధులం బొనర్చిన ప్రజాహిత జీవుల గూల్పనెంతురా?
ప్రమానును మ్రింగనెంచిన ఫలమ్మును గాంచితిరా ధరాస్థలిన్?

ఇదే మీకు నా ప్రశ్న!

[విద్రోహి దొర కేసి నివేదించుకుంటూ ఉంటాడు. హుందాతనం చాటుకుంటూ దొర పటాలంవంక చూస్తాడు. అంతలో ఒక తుపాకీ ప్రేలుతుంది. దొర కూలిపోతాడు. విద్రోహి పారిపోవ యత్నిస్తూ ఉండగా సిపాయిలు అతడిమీదకు ఉరికి పట్టుకుని వికటాట్టహాసం చేస్తారు.]

## ద్వితీయాంకం

## ప్రథమ రంగం

[ఝాన్సీ రాజ్యప్రధాని లక్ష్మణరావు తన చావడిలో పచార్లు చేయుచుండును.]

కొల్హాపురమున రంగో బాపుజీ కుమా
రుని గొంతు నురికంబమున కొసంగి,
ప్రతిభాంచితము సతారా రాజవంశమ్ము
మూపున జోలి సొంపుగ దగిల్చి,
శంకరసింగు కేసరి పుత్రుని జబల్
పురమున మరఫిరంగులకు నదలి,
ఘోరావమానమ్ము జోరాపురాధీశు
ప్రాణమ్ము నాహరింపంగ నలిపి,

ఖాండహారమ్ము బిడ్డల కాపురమ్ము,
స్వర్గతుల్యము కోమల దుర్గ మెల్ల
పీర్ల పంటల దేల్చిన పృథుయశమ్ము
ఆంగ్లులకుగాక అన్యుల కబ్బనౌనె?

ఫరంగీ పిశాచములారా! మీ అసురప్రవృత్తికి హద్దుకద్దు లేదేమి?

మాతృదాస్యము నుత్సర్జించు మానసీయులు మదోన్మాదులా? వారి కనువైన దండనము తుండె తుండెములుగ కరకు కత్తి కెరసేయుటయా? ఎంతటి మహోన్నతస్థాన మాక్రమించిన దీ ఆంగ్లరాజనీతి!

శ్వేత కిరాతుడా! నీ దండనావిధాన మెంత సునిశిత మైనది?
పాపల కుత్తుకల్ నరికి పాతరవేసిన గాథలెన్ని? మా
నాపహృతిన్ భరింపక కులాంగన లగ్నిని కూలిరెందఱ? ఏ
పాపము నెంచకే రుధిరవాహిని దోగిన ప్రాణులెన్ని? నీ
దా పగ కారణమ్ముగ భళా! పలుకాడుమురా! కిరాతుడా!!

ఫరంగీభూతమా! నీ రక్తదాహ మింకను తీరలేదా ? పవిత్ర భారత మొనర్చిన యే ద్రోహమునకు ప్రతిఫల మీ యరికృపాణ తాండవము!

మా ప్రభువొనర్చిన అపరాధమేమి? అర్భకుడు నా యువ రాజు సలిపిన అన్యాయమెద్ది? కరుణారసతరంగిణి మా మహారాణి కల్పించిన పరాభవ మెట్టిది? ఝాన్సీ స్వర్ణసింహాసనమున ఫరంగీ పిశాచదృష్టి ప్రసరించుటకు కారణ మేమున్నది? మానవత్వముగల ప్రతి ప్రాణియు దీని కొరకే సమాధానము కలదనుచున్నది. అది ఆ కిరాతుల రాజ్యప్రలోభము. ప్రాణవాయువు లర్పించి ప్రతిష్ఠాపించికొనిన పచ్చబావుటా పెరికి వేయబడవలెనట. లేనిచో ప్రళయతాండవము తప్పదట... ఝాన్సీ సింహాసనము వారి కర్పింపబడవలెనట; కానిచో సమరభూమిని చేరవలెనట. ఎంతటి దురహంకారము? ఈ వృత్తాంతమును మా మహారాణికి యేమని నివేదించుకొందును? ... ఆమెను విస్మరింపక సాధింపగల ప్రయోజన మేమున్నది?

(ఒక వార్తాహరకుడు ప్రవేశించును)

వార్తా: ప్రభూ!

దివాన్: (ఆతురాతిరేకి) ఏమి విశేషములు?

వార్తా: ఊరికి రెండామడల దూరమున బ్రిటిష్‌దళము విడిసినది. భోపాల్ హైదరాబాదు పటాలములుకూడ వారితో కూడ వచ్చినవి ప్రభూ!

దివాన్: తరువాత?

వార్తా: మహారాణి ఆదేశాను సారము పరిసర ప్రాంత మంతయు నివాసమున కనర్హము చేయబడినది; కాని......

దివాన్: కాని......?

వార్తా: టెహరీ గ్వాలియర్ ప్రభువులు......

దివాన్: నీచులు ......! వారికి సాయపడుచుండిరి కాబోలు ...! ఆపైన......?

వార్తా: మరల దర్శనము చేసికొందును ప్రభూ!

దివాన్: మంచిది....!

(వార్తాహరుడు నిష్క్రమించును.)

ఇక ఆలసించుట తగదు. మహారాణిని వర్శించితీరవలెను. ధర్మ యుద్ధము జరుగక తప్పదు. అధర్మబీజ మంతరింపక మానదు. ఇదే మా నిశ్చయము!

విజయ చిహ్నమ్ముగా అరివీర హృదయ
రుధిరమున ఝాన్సిపరవళ్ళు ద్రొక్కునరకు,
కోటగోడలు పగతుర కుత్తుకలను
తోరణములుగ ధరియించి గేరు వరకు;
నీ ప్రథానికి శాంతి లభింపబోదు;
ఈ కుఠారము విశ్రాంతి నెంచలేదు!!

(నిష్క్రమింతురు)

## ద్వితీయాంకం ద్వితీయరంగం

[ఝాన్సి మహారాణి లక్ష్మీబాయి దేవ్యాలయమున లక్ష్మీ సన్నిధానమున నుండును.]

రాణి: ...... వంశోద్ధారిణీ!

నిన్ను భజింతు దల్లివని, నిన్ను వలెన్ బతిదేవుగొల్తు, నీ
కన్నులనాడు నాప్రజ సుఖమ్ముసకై కృషిజేతు; నంతరున్
భిన్నము నూహసేయ; నది నీకును తెల్లమ; కాని, దేవి, యా
పన్నను, బ్రోవవే! హృదయభారము దీర్పవె! ప్రేమజిల్కవే!!

తల్లీ! స్వర్లోకమున నున్న నాప్రాణనాధుని ఆ దేశబలము, దర్శన మాత్రముననే నీవు ప్రసాదించు హృదయస్థైర్యము, కన్నబిడ్డల వలె నను మన్నించు ఝాన్సీ ప్రజానీకపు కార్యదీక్ష యున్ని కలిగియు నసహాయవలె గుందుచుంటినమ్మా!
స్వాతంత్ర్యమును పునఃప్రతిష్ఠిత మొనర్ప శపథమొనర్చితినే! ఝాన్సీ ప్రజాసందోహమును శాంతిసౌఖ్యముల నోలాడింతు నని బాసజేసితినే! ఈ స్వర్ణసింహాసనమున శాశ్వతముగ నిలు

పుదు నని మాటనిచ్చి మరొక తల్లి బిడ్డను మా దామోదరుని
తెచ్చికొంటిమే! మా పలుకులు నమ్మకావలసినవేనా వంశో
ద్ధారిణీ! క్షణక్షణమును మాపై కురిసే మా రాజ్యమును కబ
ళింప నుత్సహించు ఆ ఫరంగీల నెవ్విధి బ్రతిఘటింపగలను
దేవీ! ఐనను మా సలిపిన దోస మేమున్న దమ్మా!
పాపము పండి ఆంగ్లులు తుపాకులకుంబలియైన నాడు మా
తాపము నీవెరుంగుదువు తల్లిరో! వారల ధర్మపత్నులకా
నాపల నిచ్చి నుగ్రహమునకా మననిచ్చిన దాని కేను నే
డాపద గూలుచున్న, దిదియా మము గాచుట? ధర్మరక్షిణీ!

(మంథర ప్రవేశించి నిలచి చూచి చేరువగ వచ్చును)

మంథర: అమ్మా...!

రాణి: [illegible] మంథరా...!

మంథర: ఔనమ్మా! మహారాణులు మీరే యిలా...

రాణి: దేవీసన్నిధానంలో సామ్రాజ్ఞులకు సామాన్యులకు భేదం లేదు; మంథరా!

మంథర: అది కాదమ్మా! మీరే భీరుత్వం వహిస్తే మేమేం కావాలి అని.

రాణి: మంథరా! మాతృమూర్తి ముందు నేను మహారాణిని కాలేక పోతున్నానే? సరి: కాని, ఆ శరణాలయానికి వెళ్లివచ్చావా!

మంథర: (చిలిపిగా) తప్పుతుందా అమ్మా! వెళ్లేవచ్చాను.

రాణి: వారు కోరిన సౌకర్యాలు......

మంథర: అన్నీ జరిగినై తల్లీ!

రాణి: (ఆనందంతో) మరి... వా రేమనుకుంటున్నారు?

మంథర: పళ్లూఫలాలూ పెట్టేతల్లిని ప్రశంసిస్తున్నారు; తిట్లూ కొట్లూ మాకు ప్రసాదిస్తున్నారు.

రాణి: అదేమిటి? మంథరా! వారంటునే నువ్వు......

మంథర: ఔనమ్మా......! నేను ఝుషిసి చస్తున్నాను. అందుకనే వా రేమన్నా...

రాణి: (అనుమానంతో) ఏమన్నారేమిటి?

మంథర: (గునుస్తూ) మేముపెట్టడము వారుతినటము మూడునాళ్ళ ముచ్చట అనీ, బ్రతికి బట్టకట్టాలని ఉంటే వారి కిప్పుడు కూడ మేము పాదాలొత్తే వాళ్ళమే ననీని... ఇంకా యేమనాలి......?
(తీవ్రంగా) అమ్మా! ఎన్నిసార్లో మనవి చేసికొన్నాను; మీ కరుణారసవృష్టి వ్యర్థమై పోతోందని...... ఈనాడు...... తిరిగి

రాణి: (గంభీరంగా) మంథరా...... వారన్నది......?

మంథర: ఔనమ్మా......! ఇది మూడునాళ్ళ ముచ్చటే నని.

రాణి: ...... ఆపైన......?

మంథర: మాకు వారి దుర్గతే పడుతుం దని.

రాణి: ...... వారికి తగిన సమాధానం. ... !

మంథర: ఇపు ప్రత్యవసరమైనది వారికి సమాధానం చెప్పటంకాదు తల్లీ! మనకు మనం సమాధాన పరచుకోవటం. ... !

రాణి: అభిప్రాయం ...?

మంథర: ఎన్ని సార్లు మనవిచేసుకోను తల్లీ!
పామును వధించి, దాని పాలను పెంచి,
మంట చల్లార్చి కణముల మాట మరచి,
శుభము నెంచుట భ్రమ యను సూక్తి నెఱిగి
అరయు మాంగ్లుల, దేశహితార్థ; మమ్మ!!
(భటుడు ప్రవేశించును.)

భటుడు: అమ్మా!

మంథర: ఏమది ... ?

భటుడు: ఆలోచనా మందిరంలో అమాత్యశేఖరులు మహారాణివారి దర్శనా న్నర్థిస్తున్నా రమ్మా!

రాణి: (సాలోచనముగ) మంథరా!

మంథర: ఏ మమ్మా! (భటుని దక్కి) మహారాణీవారు మనవిని ఆలకించారని నివేదించు!

రాణి: మహామంత్రుల ఆగమన కారణం…?

మంధర: నా కగ్రాహ్యంగా ఉందమ్మా!

రాణి: ఏ కఠోర వార్తా శ్రవణానికి మనం…

మంధర: ఎంతటి కఠోరమైనదైనా యథార్థమే అయితే త్వరలో తెలియటమే మంచి దమ్మా!

రాణి: (శోకిస్తూ)… శాంతి నను గ్రహింపుము తల్లీ!

(నమస్కరించి, మంధర దాసీయాగా నిష్క్రమింమును)

## ద్వితీయాంకం — తృతీయ రంగం

[ఆలోచనా మందిరంలో దివాన్ లక్ష్మణరావు]

దివాన్: విప్లవాగ్ని చల్లారుటయా? కల్ల!

పాటియాల, సింధు, గ్వాలియర్, హైదరాబాదు
ప్రభువుల గూడ యీ ఫరంగి దొరలు

భారతమ్ము కబళించెదరు? చెదరు?

సంస్థానాధీశులారా! మీ కెట్టి దుర్గతి సంఘటిల్లినది? స్వాతంత్ర్య సమరసన్నాహమునకు దోహదమొసంగి, భారతీయ విప్లవతరంగ ఘట్టనల నీ బ్రహ్మాండమును బద్దలించి, సద్యశశ్శరీరు లగుటకు మారు పారతంత్ర్యమునా మీ రుపాసించునది? మిమ్ము్మను, మీరాజ్యమును, మీమీ వంశగౌరవములను పరాభవదవానలమున కింధనమ్ములొనర్చి మీ సాధింపగల జీవితపరమార్థ మేమున్నది? ప్రజాహృదయమున ప్రజ్వలించిన యీ ధర్మవిప్లవానలజ్వాల మీ రత్నఖచితస్వర్ణమకుట పంక్తిని భస్మీపటల మొనర్పక పోదని గ్రహింపుడు. స్వార్థపిశాచీ కరాళదంష్ట్రల జిక్కిన భారతధరాధినేతలారా; ఆ ఫరంగీప్రభావము మి మ్మెంతగ దాసానుదాసుల సల్పినది? ప్రతాపమార్తాండులు భారతీయ వీరసేనాపతు లవిశ్వసనీయులును ఆ పాశ్చాత్య వంచక శ్రేణి యర్చనీయమునా మీకు?

[రాణి రాకను తెలిపే గంట మ్రోగుతుంది. ఆలోచనా నిమగ్నుడైన దివాన్ అది గ్రహించి సవినయంగా ఒకవంక నిలబడుతాడు. దివాన్ గౌరవాన్ని ప్రకటిస్తాడు. రాణి స్వీకరించి ఆసీన యౌతుంది.]

దివాన్: ......మహారాణీ......!(ఉత్తరం అందించబోతాడు. మంథర అందు కుంటుంది.)

రాణి: ...మంథరా! (అది చూడ మన్నట్లు చూస్తుంది)

మంథర: అమ్మా! యిది... ఆంగ్ల సేనాపతి... సర్. హగ్. రోజ్. పంపిన సందేశము.(సందేహిస్తూ రాణీ, దివానుల వంక చూస్తుంది)

రాణి: ...ఏమని......?

మంథర: (చదువుట నభినయించును)

"ఆస గలదేని శాంతి సౌఖ్యముల యందు
అర్పణము సేయుడోయి; సింహాసనమ్ము!

(క్రోధాన్ని ప్రకటిస్తుంది)

కత్తికోతను బడ సమకట్ట రేని
పట్టు విడువుడు, దింపి, విప్లవ పతాక!!

రాణి: (సక్రోధమై అటు నిటు తిరుగుతూ) విప్లవ పతాకావరోహణము ... ఝాన్సీ సింహాసన సమర్పణము!! ఎంతటి అహంభావము? కన్నుగప్పిన రాజ్యకాంతు ఔచితి నెట్లు పాటింపగలదు? ఝాన్సీ పట్టణమును కబళింప నూహించుట చండభానుని మ్రింగ నెంచుట! మహామంత్రుల అభిప్రాయము ...?

దివాన్: అన్య మెట్లు కాగలదు...మహారాణీ!

రాణి: ఐన ... సమాధానము ... ?

దివాన్: సమాధాన మాసింపకయే ...

రాణి: ... తరలి వచ్చిరా యేమి...?

దివాన్: ఔను ... మహారాణీ!

రాణి: ఈ వార్త పట్టణమున ప్రాకియుండు నేమో...?

దివాన్: ... సంభవమే...మహారాణీ!

**రాణి:** (పచార్లుచేస్తూ) . . . మంథరా!

**మంథర:** ఆజ్ఞ, తల్లీ!

**రాణి:** నీవు శరణాలయమున కేగి...

**మంథర:** అందరను హత మార్పించనా, తల్లీ!

**రాణి:** (కోపంతో) మంథరా!

**మంథర:** (భీతితో) అపరాధం తల్లీ!

**రాణి:** . . . . ఇక నా ఆంగ్లజన సంతతి స్వేచ్ఛావిహార మొనర్చుట శ్రేయస్కరముకాదు. ఉద్రిక్తభటానీకము వారి పట్ల సలుపు అపచారము మనప్రతిష్టను కళంకిత మొనర్చును. అది మాకు సహింపరానిది.

**మంథర:** రక్షకభటుల నిలా హెచ్చరించనా అమ్మా!

**రాణి:** (తీవ్రంగా) ఔను.

[మంథర నిష్క్రమించును. రాణి ఆలోచనలో మునిగి పచార్లొనర్చు చుండును]

రాజ్యము వీరభోజ్యము. పరాక్రమ మాంగ్లేల సొత్తు కాదు; సామ్రాజ్యము లేని నిల్వవ్ర ధరాస్థలి ధర్మము నుజ్జగించి, వేమాజ్యము వ్రాలె విప్లవమహార్చుల బ్రజ్వలితమ్మొనర్చి, స్వారాజ్యము నానజేతు మిక; భ్రాంతి దొరంగి ఫరంగు లిల్లగా!

**దివాన్:** మహారాణీ!

**రాణి:** మహామంత్రీ! రక్తతిలక ధారణమొనర్చి, విప్లవసమర నేతృత్వము వహించిన యీ మహారాణి ఆశించునది రుధిరాన్నముగాని భిక్షాన్నము గాదు. మా చిరంజీవి దామోదరుల పితృపాదుల దైన యీ స్వర్ణసింహాసనము నన్య్వ లధిరోహించుటసంభవము. ఆ పరాభవము నీ కృపాణము ప్రతిఘటించితీరును. స్వాతంత్ర్య ధ్వజ ప్రతిష్టాప నావసరమునే యీ విప్లవ పతాకావరోహణము సాధ్యము. ఆ సుముహూర్త మెప్పుడా యని స్వర్గమున నున్న ప్రభువులు, మేము, మా ప్రజానీకము

కలవరించుచున్నాము. మహామంత్రులకిది సులభగ్రాహ్యము..!

[దివాను 'ఔ' నన్నట్లుగా తల పంకిస్తాడు]

రాణి: .... విజయసాధనమునకు మహామంత్రులు ...

దివాన్: సర్వసన్నాహ మొనర్చితిని; మహారాణీ!

రాణి: ప్రచారకుల ధర్మబోధ....?

దివాన్: ఫలించినది. కత్తి బట్టని కరము కనిపించుట లేదు; మహారాణీ!

రాణి: సైన్యమున నుత్సాహము ....?

దివాన్: అప్రతిహతముగ నున్నది; మహారాణీ!

రాణి: (సాదర పూర్వకంగా) మహామంత్రులు సర్వసైన్యాధ్యక్షు లగుటయే మిగిలినది కాబోలు ....!

[దివాన్ సవినయంగా ఆమె వంక చూస్తాడు. అంతలో మంథర ప్రవేశిస్తుంది. ఒక జాబును దివానుకు అందిస్తుంది. అతడది పూర్తిగా పరిశీలించి వికసితవదనుడై మహారాణి నుద్దేశించి...]

దివాన్: విజయసూచకము; మహారాణీ!

రాణి: ... వ్రాసిన దెవరు?

దివాన్: శ్రీమంత్ పీష్వాల సర్వసైన్యాధ్యక్షుడు తాంతియా తోపే.

రాణి: (ఆనందంతో) అతని ఆగమనవార్త కాబోలు...!

దివాన్: ఔను...మహారాణీ!

రాణి: బ్రహ్మవర్తమున...

దివాన్: అదియు వ్రాసినారు, మహారాణీ! అచట శ్రీమంత్ నానా కుశలురే యని; వారి 'చపాతీ' సందేశము లింకను సాగుచునే యున్నవని.

రాణి: (సంతోషంతో) చిరపిత సము...! ఇంక నేమని వ్రాసిరి ...?

దివాన్: "మన రెండుసైన్యముల నడుమను ఆంగ్లులు నలిగిపోగలరు" అని.

(మంథర కందిస్తాడు. ఆమె రాణి కందిస్తుంది. రాణి చదువుకుని ఆనందిస్తుంది.)

రాణి: మంధరా . . .! ఈజాబు తెచ్చినది . . .?

మంధర: మన గౌస్‌ఖాన్ సోదరుడు తల్లీ!

రాణి: వానికి నూరు వరహాలు మా పారితోషికము!

మంధర: సంతోషము ··· తల్లీ!

[మంధర దివాన్ వంక చూస్తుంది. అతడు తలపంకిస్తాడు]

రాణి: (పరధ్యానంగా ఉన్న దివానును చూస్తూ) మహామంత్రు లేదో . . .

దివాన్: భావికర్తవ్యము నూహించుచున్నాను మహారాణీ!

రాణి: మంధరా! మహామంత్రులకు దారితీయవే!

(మంధర దారి తీయగా దివాన్ నిష్క్రమించును)

(అటు నిటు తిరుగుతూ) మా ఆహ్వాన మెపు డందినది; నీ వెపుడు బయలుదేరితివి, తాతియా! మన బాల్యస్నేహమే నిన్ను రెక్కలుగట్టి పంపినదా యేమి? మాజాబు నందికొని మన నానా యేమని నాడు? మా 'చబేలీ' నుండియా అని యుండును. కానా? తన 'చబేలీ'కి నానా పంపిన సందేశమును హృదయమందున దాచికొని వచ్చుచుంటివి కాబోలు! మరచితిని. రావుసాహెబు విషయము వ్రాసితివే కాదు! అతనిని స్వయముగ మేమే దర్శింపవలెను కాబోలు!

(నగారా మ్రోతను రాణి ఆలకించును.)

అన్నియు శుభసూచకములే! తాతియా! నీకు మా ఝాన్సి కృతజ్ఞత తెలుపుచున్నది. ఝాన్సినీ! ఇక నీ వజేయవు!

ఈ నినదించుభేరి నిమిరించెడి పావల నేని నిల్పి మా
త్రాణ విముక్తి నెంచు రణధీరుల సల్పుట తథ్య, మింక నీ
ధ్వానము లుర్వి నేలు జయభాంకృతులన్ లయమందు గాని, స్వా
ధ్యానతబుద్ధి నీల్గ; వరులన్ బరిమార్పక పోవు, ఝాన్సినీ!!

(నగారా మ్రోత వినవచ్చు దిక్కునకే నిష్క్రమించును.)

**ద్వితీయాంకం** **చతుర్థ రంగం**

[ఒక సైనికుడు కత్తినూరుకొనుచూ పాడుకొను చుండును.]

కవోష్ణ రుధిరం చిందే ప్రాణీ
అదృష్ట మంటె నీదే నోయ్!
తళతళ లాడే కటారి చేకొని
విలయ తాండవం చేస్తావు!
మిలమిల మెరిసే కరవాలంతో
మిత్తిని హరింప జూస్తావు!!
—కవోష్ణ...

దేశక్షేమం ఆత్మగౌరవం
దీపిస్తై నీ హృదయం లో
మతప్రవృత్తిలు స్థితప్రజ్ఞులూ
జనింతురోయ్ నీ త్యాగంలో!
—కవోష్ణ...

(ఒక వృద్ధసైనికుడు ప్రవేశించును)

**వృద్ధు:** పాండ్యా!... ఓ పాండ్యా!

**యువ:** (ఆటుతిరిగి) ఏం... తాతా... !

**వృద్ధు:** తరించావురా నాయనా! నిన్నుకని నీ తండ్రి నన్నుకూడా తరింప చేశాడురా బాబూ! నీవంటి బిడ్డలు ప్రతి తండ్రికీ ఉంటే యీ లోకం స్వర్గం కాదుట్రా తండ్రీ!

ఒక్కొక్క వేటుకు ఒక్కొక్క దొరను నీవు తెగనరకటం చూసిన నా ముసలికత్తి యీరోజున యెంత నెత్తురు త్రాగిందిరా నాయనా!

మీరట్ నుంచి స్వర్గానికి పోయిన ఆ మంగళపాండ్యాను గురించే విన్నాను; యీనాడు నిన్నే చూశాను. ఎదురు లేని నీకత్తిని తలుచుకుంటే నాఒళ్ళు పులకరిస్తోందిరా బాబూ!

యువ: తాతా . . . . ! ఆ అమరజీవి మంగళ్‌పాండ్యా కూ నాకూ పోలి కేమిటి? ఆ అదృష్టం నా కెలా లభిస్తుంది?

వృద్ధు: నువ్వేం తక్కువ చేశావురా నాయనా!

యువ: అతడి కరవాలం సేనాపతులను గాని, యితరులను అంటుకోలేదు తాతా!

వృద్ధు: యుద్ధభూమిలో ఆ భేదం ఉండదురా నాయనా!

యువ: అదీ కాక మంగళ్‌పాండ్యా నొక పెద్దపటాలం ముట్టడిస్తే, వెంటనే అతడు తన్ను తాను కాల్చుకున్నాడు.

వృద్ధు: ఆఁ . . . ! అదేమిటి? ఉరితీశా రన్నారే!

యువ: ఉంతియ్యలేదు తాతా; అతడే ఉరిత్రాడు బిగించుకొన్నాడు. పడిపోయిన అతడిని పట్టుకుని దొరలు శిక్ష వేశారు. కాని, అతని మెడకు ఉరి తగిలించేందుకు కసాయిలుకూడా ఒప్పుకోలేదు. అప్పు డతడే స్వయంగా. . . .

వృద్ధు: (సాశ్చర్యంగా) ఎంతటి వీరుడురా. . . . !

యువ: (కత్తినూరుకోవటం సాగించి) ఇంతకూ నీకాలు మెలా ఉంది తాతా!

వృద్ధు: ఇరవై రెండు వే లున్న తాతియాతోపే సైన్యమే విరిగినప్పుడు నా కాలు విరగటం ఓ లెక్కటోయ్ పిచ్చితండ్రీ!

యువ: (ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ) అడగటం మరచాను. అ దెలా జరిగిందంటావు తాతా!

వృద్ధు: ఎవరికి తెలుసు; నాయనా! అసలు సైనికుడిలో భయ మనేదే ఉండరాదు; ఉన్నదో అది అలాగే చేస్తుంది. అయినా బ్రతకాలని పారిపోతే చస్తారనీ, చావటానికి సిద్ధపడి పోట్లాడితే బ్రతుకుతారనీ ఒకరు చెప్పాలీ?

యువ: అంతే అయి ఉంటుంది. . . . ఇది విన్నావా తాతా! పశ్చిమ ద్వారంమీద ఫిరంగి కాల్చే గులాం గౌస్‌ఖాన్ చాకచక్యాన్ని మెచ్చుకొని మహారాణి వెండితోడా వేశారుట.

**వృద్ధు:** అ దొరకటేనా బాబూ! ఎక్కడపడితే అక్కడే ఆమహాతల్లి దర్శన మిచ్చింది. ప్రతి సైనికునీ పరామర్శించింది. ఎందరినో బహూకరించింది. ఆవిడ.... యుద్ధంలో కాళికాదేవే గాని మన మధ్య శ్రీమహాలక్ష్మిరా!

**యువ:** తాతా!

[అంతలో నగారా మ్రోత వినిపిస్తుంది; మనుమడు దారి తీయగా తాత అనుసరిస్తాడు]

## ద్వితీయాంకం — పంచమరంగం

[సమయం అర్ధరాత్రి. ఝాన్సీపట్టణ పరిసరాల్లో సైనికసంఘర్షణ. ఇరువాగుల సైన్యాలూ హోరాహోరిగా పోరాడుతూ ఉంటై. ఇరుపక్షాలకు చెందిన సమర నినాదాలూ దిక్కుల ప్రతిధ్వనిస్తూ ఉంటై. అవనికాభ్యంతరంలో ఝాన్సీ సమర గీతి.]

మారో ఫరంగీకో . . !
హరహర మహాదేవ్!
అల్లాహో అక్బర్ ....!
ఖతల్ కరో... కాటో ...!
బ్రేవో ... బ్రేవో ... మార్చాన్!

[అనే నినాదాలు వేలకొలది వినిపిస్తై]

## ద్వితీయాంకం — షష్ఠరంగం

[దివాన్ లక్ష్మణరావు ఏకాంత ప్రదేశంలో పచార్లు చేస్తుంటాడు. ఏదో దీర్ఘంగా ఆలోచిస్తూ ఉంటాడు. క్షణక్షణ పరివర్తనం అతని మోమున ద్యోతమాతూ ఉంటుంది.

గాయపడిన మంథర ప్రవేశించి, ఆగి, అతడిని చేరటానికి శంకిస్తూ ఉంటుంది. అటు నిటు పరికించటంలో దివాన్ మంథరను గుర్తించాడు. 'ఏమిటి' అన్నట్లుగా ఆమెను తిలకిస్తాడు.]

**దివాన్:** .... మంథరా .... !

**మంథర:** ఔను స్వామీ!

**దివాన్:** ప్రాణరక్షణకు పారివచ్చావా?

మంథర: . . . లేదు స్వామీ!

దివాన్: . . . మరి . . . . ?

మంథర: పరిస్థితిని తమకు నివేదించు కొందా మని!

దివాన్: మహారాణికి క్షేమమే కదూ!

మంథర: చిత్తము.

దివాన్: యువరాజులు దామోదరులు . . . . ?

మంథర: కుశలురే స్వామీ!

దివాన్: . . . . ఐన . . . . ?

మంథర: ఇకపైన మహారాణి చిరంజీవుల రక్షణభారాన్ని మహామంత్రులే స్వీకరించా లని ప్రార్థన.

దివాన్: మహారాణి బాల్యసఖి మంథర ప్రథనభూమికి పర్వెత్తును కాబోలు!

మంథర: అది అసంభవముకాదు స్వామీ! మహారాణి చేసే స్వైర విహారం మంథరకే భయాన్ని కలిగిస్తోంది. వంశాంకురాన్నైనా మరొక సురక్షిత ప్రదేశానికి. . . .

దివాన్: అపాయాన్ని శంకిస్తున్నదా మంథర. . . ?

మంథర: లేదు స్వామీ! కాని, అది అవశ్యకర్తవ్య మనిపిస్తోంది. క్షణ క్షణము క్షీణిస్తున్నది మన సైన్యం. మన ఫిరంగులు సాయుధ భటవర్గము విశ్రాంతిలేక పరిమారుస్తున్నా శాత్రవసైన్యం ప్రవర్థమాన మౌతూనే ఉంది. శత్రువు శంకరఖిల్లానుంచి కురిపించే అగ్నివర్షం మన జలాశయాన్ని భగ్నం చేసింది. ఫలోద్యానం లోని మందుగుండు కర్మాగారం లక్ష్యంగా వారిపుడు ఫిరంగులు ప్రేలుస్తున్నారు. కందకమంతా నెత్తురుటేరై ప్రవహిస్తున్నా ఆంగ్లయోధులు ప్రాకారారోహణమునకు సోపానాలు నిర్మిస్తూనే ఉన్నారు. మన మహారాణి మహామంత్రుల కనుగప్పి మారణ హోమాన్ని స్వయంగానే జరుపుతున్నారు.

వృద్ధు: అ దొరకేనా బాబూ! ఎక్కడపడితే అక్కడే ఆమహాతల్లి దర్శన మిచ్చింది. ప్రతి సైనికునీ పరామర్శించింది. ఎందరినో బహూకరించింది. ఆవిడ.... యుద్ధంలో కాళికాదేవే గాని మన మధ్య శ్రీమహాలక్ష్మిరా!

యువ: తాతా!

[అంతలో నగారా మ్రోత వినిపిస్తుంది; మనుమడు దారి తీయగా తాత అనుసరిస్తాడు]

## ద్వితీయాంకం — పంచమరంగం

[సమయం అర్ధరాత్రి. ఝాన్సీపట్టణ పరిసరాల్లో సైనికసంఘర్షణ. ఇరువాగుల సైన్యాలూ హోరాహోరిగా పోరాడుతూ ఉంటై. ఇరుపక్షాలకు చెందిన సమర నినాదాలూ దిక్కుల ప్రతిధ్వనిస్తూ ఉంటై. ఆ వని కావ్యంతరంలో ఝాన్సీ సమర గీతి.]

మారో ఫరంగీకో......!
హరహర మహాదేవ్!
అల్లాహో అక్బర్ ....!
ఖతల్ కరో... కాటో ...!
బ్రేవో ... బ్రేవో ... మార్చాన్!

[అనే నినాదాలు వేలకొలది వినిపిస్తై]

## ద్వితీయాంకం — షష్ఠరంగం

[దివాన్ లక్ష్మణరావు ఏకాంత ప్రదేశంలో పచార్లు చేస్తుంటాడు. ఏదో దీర్ఘంగా ఆలోచిస్తూ ఉంటాడు. క్షణక్షణ పరివర్తనం అతని మోమున ద్యోతమౌతూ ఉంటుంది.

గాయపడిన మంధర ప్రవేశించి, ఆగి, అతడిని చేరటానికి శంకిస్తూ ఉంటుంది. అటు నిటు పరికించటంలో దివాన్ మంధరను గుర్తించాడు. 'ఏమిటి' అన్నట్లుగా ఆమెను తిలకిస్తాడు.]

దివాన్: .... మంధరా .... !

మంధర: ఔను స్వామీ!

దివాన్: ప్రాణరక్షణకు పారివచ్చావా?

మంధర: . . . లేదు స్వామీ!

దివాన్: . . . మరి . . . . ?

మంధర: పరిస్థితిని తమకు నివేదించు కొందా మని!

దివాన్: మహారాణికి క్షేమమే కదూ!

మంధర: చిత్తము.

దివాన్: యువరాజులు దామోదరులు . . . . ?

మంధర: కుశలులే స్వామీ!

దివాన్: . . . . ఐన . . . . ?

మంధర: ఇకపైన మహారాణీ చిరంజీవుల రక్షణభారాన్ని మహామంత్రులే స్వీకరించా లని ప్రార్థన.

దివాన్: మహారాణి బాల్యసఖి మంధర ప్రథనభూమికి పర్యేత్తును కాబోలు!

మంధర: అది అసంభవముకాదు స్వామీ! మహారాణి చేసే స్వైర విహారం మంధరకే భయాన్ని కలిగిస్తోంది. వంశాంకురాన్నైనా మరొక సురక్షిత ప్రదేశానికి. . . .

దివాన్: అపాయాన్ని శంకిస్తున్నదా మంధర. . . ?

మంధర: లేదు స్వామీ! కాని, అది అవశ్యకర్తవ్య మనిపిస్తోంది. క్షణ క్షణము క్షీణిస్తున్నది మన సైన్యం. మన ఫిరంగులు సాయుధ భటవర్గము విశ్రాంతిలేక పరిమారుస్తున్నా శాత్రవసైన్యం ప్రవర్థమాన మౌతూనే ఉంది. శత్రువు శంకరఖిల్లానుంచి కురి పించే అగ్నివర్షం మన జలాశయాన్ని భగ్నం చేసింది. ఫలో ద్యానం లోని మందుగుండు కర్మాగారం లక్ష్యంగా వా రిపుడు ఫిరంగులు ప్రేలుస్తున్నారు. కందకమంతా నెత్తుటేరై ప్రవహి స్తున్నా ఆంగ్లయోధులు ప్రాకారారోహణమునకు సోపానాలు నిర్మిస్తూనే ఉన్నారు. మన మహారాణి మహామంత్రుల కను గప్పి మారణ హోమాన్ని స్వయంగానే జరుపుతున్నారు.

దివాన్: మహారాణు లిపుడు....

మంథర: ఆ విషయాన్ని పాదదాసి నిర్ణయింప లేదు స్వామీ! విద్యుల్లత మాదిరి ఆమె కృపాణం వీరభూమి నంతటా విహరిస్తూనే ఉంది.

దివాన్: మరి యువరాజులు....?

మంథర: మా సోదరి కాశీ రక్షణ క్రింద దేవాలయంలో...

దివాన్: మంథరా....! ఇక మనధర్మం....

[మారోపంత్ ప్రవేశం]

మారోపంత్: ... దివాన్‌జీ...!

దివాన్: ..., మారోపంత్!

మారో: ప్రధానద్వారాన్ని వదలి ప్రాకారారోహకులు దక్షిణద్వారాని కురుకుతున్నారు.

దివాన్: ...వారి అభిప్రాయం....?

మంథర: ....అది సుసాధ్యం కావచ్చునని కాబోలు!

మారో: అలాగే తోస్తోంది. మోర్చాద్వారపాలకుని మహారాణి కూడా శంకించారు.

[భటుడు ప్రవేశం]

భటుడు: స్వామీ!

మంథర: .... ఏమది...?

భటుడు: దక్షిణపు బురుజుమీది మన శతఘ్నిదళ నాయకులు ఖుదా భక్షు, గులాం గోస్ ఖాన్‌ల మరణాన్ని మహామంత్రులకు నివేదించమని మహారాణుల ఆజ్ఞ!

దివాన్: మహారాణులు....?

భటు: దక్షిణ ద్వార రక్షణ సన్నాహంలో ....

దివాన్: మారోపంత్! మోర్చా ద్వారం మీరాక నాశిస్తూ ఉంటుంది.

(మారోపంత్ నిష్క్రమణ)

మంథరా! మహారాణులు ప్రాసాదాన్ని చేరుట భావ్య మేమో!

మంధర: అలానే తోస్తోంది స్వామీ! కాని ....

దివాన్: ఇది మా అభిప్రాయ మని మనవి చెయ్యాలి!

(మంధర తలవంచి నమస్కరించి నిష్క్రమిస్తుంది.)

దివాన్: (అటు నిటు తిరుగుతూ)

పౌరుషమ్ము నుగ్గుబాలతో సేవించి
త్యాగదీక్ష నంది నట్టి ఝూన్సి
కొన్ని దలచి మనిన దేవదుర్గా యింపినక ....?

(భటుడొకడు ప్రవేశించును.)

భటుడు: ప్రభూ! ఫిరంగీ సైన్యం...

దివాన్: [ఉలుకుతో] ఫిరంగీ సైన్యమా? ఎవరి దీ హెచ్చరిక...?

(వారునిరిక్షించి) ఓ...నీవా! ఆఁ...! ఫిరంగీ సైన్యము...

భటు: దక్షిణ ద్వారం లోకి......

దివాన్: చాలు......! నీ విక పోవచ్చును......! శతఘ్నీ దళాధిపతుల మరణవార్తను మహారాణి మాకు పంపినది. శాత్రవు నేని శంకింపని మా కోపంతు మాతృభూమిని ద్రోహ చింత జనిం చిన దని సూచించినాడు. మా మంధర యువరాజులకు నగర నివాసము శ్రేయస్కరము కాదనుచున్నది. ..... ఇంతలో నీ వా

(ఆంగ్లుల ఆనంద కోలాహలము. ఝూన్సీ ప్రజల హెచ్చరికలు...... కల్లోలము......అవి వినిన దివాన్ ఒరనుండి కత్తిదూసి అటే తిలకించు చుండును)

## ద్వితీయాంకం — అష్టమ రంగం

[అటు నిటు పరుగులుతీసే సేనలు ... ఎక్కడి కక్కడే సమరము ... కత్తుల పోరు ... ఫిరంగుల మ్రోతలు ... నినాదాలు ... వారి నుద్దేశిస్తూ దివాన్ లక్ష్మణరావు ప్రవేశం ...]

...కొట్టుడు...! నరకుడు...! ఝూన్సీ వీరకుమారులారా! మరువకుడు...! మీ మతము, ధర్మము ... స్వాతంత్ర్యము,

మాతృభూమి, తుదకు మీ మహారాణి సర్వమును నేడు మీ అధీనము. మీ కరవాలమే ఝాన్సీ స్వాతంత్ర్య పతాకము...! మీ ఫిరంగీ ధ్వానమే మీ మహారాణి యశస్సు... ప్రాణభీతి నెరుగని యోధులారా! నిలుడు! మీ భుజబలము, శౌర్యము, కదన పాండిత్యము, త్యాగము, విశ్వాసము యివే మన యువ రాజు దామోదరుల ప్రాణపంచకము. కనబడిన ద్రోహుల నెల్ల కరకుకత్తి కెరసేయుడు. నిలబడిన తావుల నెల్ల శాత్రవ శిరము లను విజయ పతాకలుగ యెగురవేయుడు! సోదర వీరులారా! మీ మాతృభూమి ఆంగ్ల రుధిరము నాసించుచున్నది! మీ కన్న తల్లి మీ కదన క్రీడకు ఆనందము తెల్పుచున్నది. నిలుడు...! నరుకుడు...!!

(శంఖారావము, కల్లోలము, నినాదాలు)

**ద్వితీయాంకం** **నవమ రంగం**

[దేవాలయంలో మహారాణి లక్ష్మి]

**రాణి:** తల్లీ!

కోరినరక్తముగ నిలిచి కొమ్మది కాదనబోము; కాని, ఝా
న్సీ రణమందు వీగె నను నిందను మాత్రము సైపలేము; మం
కోరిన దెల్ల ధర్మమునకుం బరిరక్షయ గాదె? త్వత్కృపా
సారము గల్గ నయ్యది యసాధ్యమె? పల్కవదేల; శాంకరీ!

ఈ పాద దాసి ప్రార్థనను మన్నింపుమమ్మా! మా మాతృ భూమి దాస్య విముక్తినందిన అదియే మాకు పదివేలు. మా మతము, ధర్మము, ఆచారములు పరాభవింప బడకుంటయే మా పరమాశయము.

దక్షిణ ద్వారమును దగ్ధపరచిన స్వార్థపిశాచి దశదిశా వ్యాప్తము కారాదు తల్లీ! ఇప్పటికైనను మించినదిలేదు. ఝాన్సీ కరవాలమింకను మొక్కవోలేదు. వీరసైనిక నికాయ మున నిందన్క పరాజయ శంక పొడజూప లేదు. మాతా!

మా కాంక్షించెడి దెల్ల మా స్వాతంత్ర్యపతాక సుశాశ్వతమై పురగోపురాగ్రమున సగర్వముగ నెగురవలెనని; అందులకే మా యీ సంప్రార్థనము.

[అంతలో మంథర ఆదుర్దాతో ప్రవేశించును.]

మంథర: . . . . అమ్మా!

రాణి: (ఆటుపట్టై నిశ్చలంగా పరికిస్తుంది. మంథర విచారోద్రేకంలో ముఖం చేతులతో కప్పికొంటుంది)

రాణి: (గంభీరంగా ఆదరంతో) మంథరా!

మంథర: అమ్మా! మోర్చాద్వారం మీద ఫరంగీ పతాకం ...

(కళ్లు మూసుకుంటుంది)

రాణి: మన పటాలము . . . . ?

మంథర: అడుగడుగునకును ఫరంగీల ప్రతిఘటించు చున్న దమ్మా!

రాణి: మహా మంత్రులు......?

మంథర: పరాజయాన్ని శంకించిన పదాతి వర్గానికి ధర్మాన్ని ప్రబోధిస్తున్నా రమ్మా!

రాణి: (గాద్గదికంగా) మంథరా! బాలరాజుల రక్షణకు నీవు......

మంథర: ......తమరో......

రాణి: సమరరంగ పరిశీల నార్థం......

మంథర: పరిస్థితి

రాణీ: మంథరా! మహారాణికి భీరుత్వాన్ని కల్పిస్తున్నావే!

మంథర: భీరుత్వాన్ని కల్పించటంకాదు తల్లీ...! అది ప్రజాభిప్రాయం.

రాణి: (సాలోచనగా) మంథరా! మహారాణికే అపాయాన్ని శంకిస్తున్నదా ఝాన్సీ ప్రజ? ఈ అభిప్రాయమునేనా మహామంత్రు లీవరకు వ్యక్తపరచినది? ఎంతటి వైపరీత్యము?

(వార్తాహరుడు ప్రవేశించును)

వార్తా: అమ్మా!

రాణి. ...ఏమది...?

వార్తా: ఆక్రమిత ప్రదేశంలో ఆంగ్లేయులు జరిపే అత్యాచారం హద్దుమీరి పోతోం దమ్మా! కనబడిన ప్రాణిని వారు కనికరించట మన్నది కనబడదు. ప్రత్యేకించి స్త్రీలు ఆబాలగోపాలం అడలి పోతున్నా రమ్మా! వారి శక్తికే మించిన పనిగా ఉంది ప్రతిఘటించటం...! ఆత్మహత్యలు...

రాణి: ...ఇక నీవు పోవచ్చును...!

(సైనికుని నిష్క్రమణ)

(మంధరతో) మంధరా! నీ విద్యుక్త ధర్మాన్ని నీవు ...

(చరచరా వెళ్ళబోగా దేవిని చేరుతుంది)

మంధర: ...అమ్మా...!

రాణి: మంధరా! ఈ ఆజ్ఞాపించునది......

(మంధర కదలి వెడుతుంది)

(దేవి నుద్దేశించి)

జననీ!

స్వాతంత్ర్య సమర ఝంఝూ మరుత్తున దాస్య
భూరుహమ్ములు కూలి పోవు ననుచు,
ధర్మసంస్థాపనోత్సాహమ్మునన్ ద్రోహ
చింతన మ్మెల్ల నశించు ననుచు,
వీరుల యశము కల్పించు శౌర్యము విప్ల
వాగ్నికీలల కాజ్య మౌన టనుచు,
ప్రజ మున్ను గొనిన పరాభవ మ్మిక ప్రతి
కృతి సేసి కీర్తి నార్జించు ననుచు,

ఈ ధ్వజ మ్మిక శాశ్వతమే నటనుచు,
ఈ ప్రజాళికి శాంతి లభించు ననుచు,

మురిసి నన్నాళ్ళు పట్టె దీ దురిత మేమొ
తల్లి! నీ ఝాన్సి నేడు వంతలకు వీడు!!

(తెరపడును)

## ద్వితీయాంకం      ద౦మ రంగం

[ఒక విప్లవ కారుడు సైన్యాన్ని ఉద్బోధిస్తూ ఉంటాడు]

౧. పంది క్రొవ్వు ముస్లింలకు-హిందువులకు గోమాంసం
తూటాలను కూరి నోటితో కొరికించిన మోసం
మరువకోయి! మరచితివా మాతృదేవి కవమానం
ఖతల్ కరో! ఖతల్ కరో! ఫరంగీకో ఖతల్ కరో!!

౨. ఫిరంగీల యెదురు నిలిపి పేల్చిరి విప్లవ వీరుల
కొమ్మ కొమ్మ కురి బిగించి కూల్చిరి మన ప్రాణమ్ముల
భరతపుత్ర! నాటి పరాభవము సమయ చేయుమోయి
ఖతల్ కరో! ఖతల్ కరో! ఫరంగీకో ఖతల్ కరో!!

3. పసిగుడ్ల చెరబట్టిరోయి, మతము మంట గలిపిరోయి
పచ్చినెత్తురు జుర్రు ఫరంగీల విడువ పాపమోయి!
ఖతల్ కరో...! ఖతల్ కరో.. !! ఖతల్ కరో!!...

## ద్వితీయాంకం      ఏకాదశ రంగం

[ఆలోచనా మందిరంలో భర్త చిత్రపటం ముందు ఝాన్సీ రాణి]

రాణి: ప్రభూ!

"మనవలె దామోదరుని శ్రేయమున కన్న
మీ నిమిత్తము 'సతి' మానినాను,
"రాజ సుతవు; ఖడ్గ రాజమ్ము గొను"మన్న
మీ కోర్కెగా దాని సాచినాను,
"ప్రేమ నమృతమును వర్షింపుమీ ప్రజక"న్న
హృదయమే వారి కర్పించి నాను,
"భీతి నందకు శ్వేతభూతాల గని" యన్న
శిరసెత్తి వారి నెదిర్చినాను,

ఎంచి మీ సూక్తు లెల్ల పాలించి నాను,
ధర్మరణమున రుధిరమ్ము స్రావినాను,
కాని, భీతిలి ఖిన్నము జేరినాను నాథ!
సెలవు దయ సేయుడీ ఝాన్సి నిలచు తెరవు!!

ప్రాణేశ్వరా! ఇక మీ పద దాసి కేమని సెలవు? తమ ఆదేశ మిప్పట్టున నేమని? తమ యీ సింహాసనపు అంగ్లేయ స్పర్శనంది అపవిత్రము కావలసినదేనా? మీ ధర్మ భూమిని ఆ పిశాచీ విలయ తాండవము సాగ వలసినదేనా? ప్రతాప మహారాజుల పుట్టినిల్లు యీ మహారాణుల పాలనమున సర్వైశ్వర్యమై పరా భూత మైన దను దుర్యశమును గ్రహింపవలసినదేనా? నాహృదయ మింకను ప్రయత్నలు కాదేమి? నా ఆశ యింకను నాశము కాదేమి? ప్రాణ పతీ! నాకు ధైర్యమునా ప్రసా దింతురు! నా నిర్వహింప వలయు కార్యము లింకను కల వనియా!

... మీ నయన గోళము లుజ్వలములై ప్రకాశించుచున్న వే! మీ వదన గాంభీర్యము ప్రసన్న మగుచున్న దే! ఏమి? దుర్యశము ఝాన్సీని దహింప దనియా? మీ పాదదాసి కీర్తి మకుటమును ధరించు ననియా! ప్రభూ! .... ప్రభూ..... !

[పటాన్ని హృదయానికి హత్తుకుంటుంది. వాకిట్లో కల్లోలం. రాణి అది ఆలకిస్తూ ఉండగా మంధర ప్రవేశం]

మంధరా! ప్రాసాదమున నీ కల్లోలమేమి?

మంధర: పురప్రముఖులు ... తమ దర్శనార్థం......

రాణి: దాని అవసరము .... ? (ఆలోచించి) ఆఁ..... మంధరా!
... వారి కరవాలములు .. ?

మంధర: ఇంకను శాంతిల లేదమ్మా!

రాణి: నేత్రము లెట్లున్నవి .. ?

మంధర: అగ్నినే వర్షించుచున్న వమ్మా!

రాణి: (సాలోచనముగ) వారి రాక సార్థకమైనదే! ఈ మహారాణి వారి సమక్షమున నిలువ వలసినదే!

దాస్యశృంఖలములు త్రెస్సి పోవునని, స్వధర్మ మిక సుప్రతిష్ఠిత మౌనని, ఈ విప్లవ పతాక అజేయమై శాంతి సౌఖ్యముల ప్రసాదించునని, ఇకపై సర్వము సుభిక్షమై వెలయునని మాటనిచ్చి యీ మహారాణి సల్పిన మహత్కార్య మేమున్నది?

ఝాన్సీ పురవీధులు రక్త వాహినులైనవి. ఝాన్సీ స్వాతంత్ర్య మదృశ్యము కానున్నది. విప్లవ కేతనము గజ గజ లాడుచున్నది. ఈ మహారాణి మిత్రము ... రాజ ప్రాసాదమున ... మంధరా! ఏదీ ... దారిచూపుము ...!

మంధర: ... వారు కోరునది...

[తెరలో "ఝాన్సీ మహారాణి జిందాబాద్" "ఇంక్విలాబ్ జిందాబాద్" అను ధ్వనులు]

రాణి: వారి వాంఛ మాకు తెలియును ......మంధరా ......! మహారాణి దైన శక్తిహీనత వారికి గ్రాహ్యమైనది.

మంధర: అమ్మా .....తమరు......

(భటుడు ప్రవేశించును.)

భటు: అమ్మా......మహా మంత్రులు......

రాణి: కార్య రంగమును వీడి మహా మంత్రులు మహారాణి దర్శనమునా ఆకాంక్షింతురు! మా మాతృభూమి యెంతటి పతనము నందినది......? మంధరా...... వారికి సెలవు చెప్పుము!!

(మంధరా భటుడూ నిష్క్రమింతురు. దివాన్‌తో మంధర పునః ప్రవేశము. అంతవరకు ఝాన్సీరాణి ఆందోళనతో అటు నిటు తిరుగుచుండును.)

దివాన్: మహారాణీ...!

తమ రిక...

రాణి: రాజ్య పరిత్యాగ మొనర్పవలె ననియా మహామంత్రుల అభిప్రాయము!

దివాన్: (ఖిన్నుడై) క్షంతవ్యుడను మహారాణీ! నా అభిప్రాయ మది కాదు.

రాణి: ...... కానిచో...... !

దివాన్: ఈ ప్రాసాదమున తాము వసించుట ప్రకృతమునకు శ్రేయోదాయకము కాదని.

రాణి: అభిప్రాయము...... ?

దివాన్: యువరాజులతో తాము మరొక సురక్షితప్రదేశమునకు పోవుట సమంజస మని ......

రాణి: స్వీయ రక్షణకేని యీయమ యశక్తురాలని మహామంత్రులును నిర్ణయించిరి కాబోలు!

దివాన్: అది కాదు మహారాణీ! శాత్రవసైన్యము క్షణ క్షణమును ప్రాసాదమునకు చేరు వగుచున్నది. నలుదెశల నుండియు స్వాతంత్ర్యవీరులు ప్రాసాదరక్షణకై పరిపడి వచ్చుచున్నారు; ఖండిత శిరసందోహమును తన్నుకొనుచు ఆంగ్ల సైన్య మప్రతిహతమై ప్రాకార పంక్తిని గమించుచున్నది. తుములము ఘోర మైనది. మన పవిత్రాశయము......

రాణి: మహాసేనా పతులేనా యీ పలుకునది......?

దివాన్ (తలవాల్చుకొని) క్షంతవ్యుడను మహారాణీ! ఈతని ఆధిపత్యమున ప్రాణములతో ఝాన్సీ పతనమును నిలకించు వీరులు లేరు మహారాణీ! శాత్రవ శిరచ్ఛేదమునకు తుది కరవాలము కూడ లంఘించి తీరు ననుట ధృవము. ఈ ముహూర్తమున ప్రతిజీవియు తమ క్షేమమునే ఆకాంక్షించుచున్నది...

(వాకిట కల్లోలము.)

మంథర: అమ్మా! ప్రజావాంఛితము నదియే !

(వార్తాహరుని ప్రవేశం)

వార్తా: ప్రజా సమూహం ప్రాసాదం లోకి చొచ్చుకు వస్తున్న దమ్మా!

మంధర: ... మహారాణులు మహా మంత్రులతో సంప్రదిస్తున్నారని వారికి మనవి చేసుకో!

(వార్తాహరుని నిష్క్రమణ)

రాణి: మహామంత్రీ...! అది అసంభవము. మీ మహారాణికే తా మూహించిన తుది కరవాలము కావచ్చును.

దివాన్: ...కాని...

రాణి: సందేహమున కింక తావులేదు; మహామంత్రీ!

దివాన్: స్వర్గమున నున్న ప్రభువుల కది...

రాణి: ఆశాభంగము కలిగింతునా మహామంత్రీ!

దివాన్: ఔను ...మహారాణీ! బాలరాజుల రక్షణభారమును వారు తమపై నిడుట వలన...!

[తిరిగి కల్లోలం. దీర్ఘాలోచనలో మహారాణి వాకిటి వేపు గమిస్తుంది. దివాన్ మంధ ఆమె ననుసరిస్తారు.]

## ద్వితీయాంకం ద్వాదశ రంగం

[ఒక ప్రాకారం మీద నిలబడి సర్. హూగ్. రోజ్ సైన్యాన్ని ఉత్సాహ పరుస్తూ ఉంటాడు. ఫిరంగి కాల్పులు ......కత్తుల ఝణం ఝణ ధ్వనులూ, ఆక్రందనలూ, ఉద్రేకపూరిత నినాదాలూ హెచ్చు పెరిగిపోతై]

రోజ్: మారో...! కాటో...! బ్రేవో... బాబ్ లోగ్...! మార్చాన్...!! మార్చాన్...!! ఛోడోమత్...! క్రష్ ది ట్రెచురస్ రెబెల్యూ ష్నరీస్......!!

(తెరలో) ఫరంగీకో మార్ డాల్నా ...! ఖతల్ కరో...! ఖతల్ కరో...!! ఫరంగీకో ఖతల్ కరో...!!

హర హర హర మహాదేవ్......!

అల్లాహో అక్బర్... అల్లాహో అక్బర్...!

రోజ్: బ్రేవో బాబ్ లోగ్...! మార్చాన్...! మార్చాన్...!!

**ద్వితీయాంకం** **త్రయోదశరంగం**

[భర్త పటం ముందు మహారాణి లక్ష్మీబాయి మూర్తీభవించిన విషాదం వలె ఉంటుంది.]

రాణి: ...ఝాన్సీ పరాజయమును శంకించు చున్నది. మహారాణిని పలాయనమునకు ప్రజలు ప్రోత్సహించు చున్నారు. ప్రాణపతీ! ఏమని మీ ఆదేశము...?

ఆత్మహత్య కుద్యమింతునా; పీష్వాల వంశమునకే కళంక మేమో!... ...పోరున ప్రాణత్యాగ మొనర్తునా; బాల రాజులు దామోదరులకు ద్రోహ మొనర్చుట యగునేమో! ప్రభూ!...మన బాలరాజుల శ్రేయమేగదా మన పరమాశయము. ఈ మహారాణి మిము చేరునంతకు బాలరాజుల రక్షణను విస్మరింప లేదు. ఇయ్యది విశ్వసింపుడు ప్రభూ! ఈ వియోగమును తాత్కాలిక మొనర్పుడు! ఈ ఝాన్సీ సింహపీఠిని మన చిరంజీవి అధిష్ఠించు వరకు, ఝాన్సీ పురగోపురాగ్రమున స్వాతంత్ర్య పతాకము ఆవిర్భవించు వరకు, ధర్మదేవత ఆ పతాకచ్ఛాయను లాస్య మొనర్చు వరకు, ఈ మీ చరణదాసి అహర్నిశలు కృషించు భాగ్యము ప్రసాదింపుడు ప్రభూ!

(మంథర ప్రవేశం)

మంథర: అమ్మా! జవాహిరి నంతను మత్త గజేంద్రముల మీద పూన్చితిమి. అశ్వికదళ మొకటి శ్రీమోరోపంత్ అధ్వర్యమున తమకై ఉత్తర గవాక్షమున నిరీక్షించు చున్నది. తమ పంచ కళ్యాణి...

రాణి: యువ రాజులు ... ?

మంథర: అంగరక్షకుల నడుమ దేవ్యాలయమున విశ్రమించి ఉన్నారమ్మా! దారిలో వారిని మనము... ...

రాణి: మంథరా... ...

మంథర: [చేరువగా పోయి] అమ్మా...!

[రాణి చేతిలోని భర్తపటాన్ని కళ్లకద్దుకొని మంథర కందిస్తుంది. మంథర కన్నీరురాలుస్తుంది. రాణి అలాగే దీనంగా చూస్తూ ఉంటుంది]

## తృతీయాంకం

## ప్రథమ రంగం

[మాల్వీ అహమ్మదుషా ఆలోచనా నిమగ్నుడై ఉంటాడు. అమర సింహు డతని ప్రక్కనే ఉంటాడు]

మాల్వీ: ఇందనుక మా సలిపిన విప్లవ ప్రచారము ఫలించినది. నేటి సంప్రదింపులతో యీ అహమ్మదుషా మరొక విజయమును సాధించి తీరును. 'హోవెన్' రాజప్రాసాదము స్వాతంత్ర్య యోధులకాశ్రయ మిచ్చి భారతీయ చరిత్రయందు సుశాశ్వతమై విరాజిల్లక మానదు. అమర్! నీ అభిప్రాయ మేమి?

అమర: తమ విశ్వాసమునకు 'హోవెన్' అనర్హుమేమో యని.

మాల్వీ: అమర్! విశ్వాసము కదా విప్లవమునకు మూలము. అయిన నాతని ఆహ్వానమును నీవును పరిశీలించితివే! అందు అవిశ్వాసనీయ విశేష మేమున్నది?

అమర: మీ సందేశ మాతని హృదయ పరివర్తనమునకు మూలమైన ససైన్యముగ ఆతడే మిమ్మేల కలిసికొనరాదు? విప్లవానలమున మడియుటకే ఆతడు కృతనిశ్చయుడైన యిక మీతో సంప్రదింప వలసిన దేమున్నది? ఇందేదో కుతంత్ర మిమిడి యున్న దనియే నా అభిప్రాయము.

మాల్వీ: శంకించుట మానవ సహజ మైనది; అమర్!

అమర: అదే కాకున్న విప్లవ మీ వరకే విధ్వస్తమై యుండెడిదేమో!

మాల్వీ: నీ అభిప్రాయము నా కగ్రాహ్యముగ నున్నది.

అమర: 'హోవెన్' నరేంద్రుడా ఫరంగీల పెంపుడు బిడ్డ డను మాట మరువ దగినది కాదు. ఆత డాంగ్లేయుల కండయై నిలచుటయు మన మెరుంగనిది కాదు. అతని సంస్థానమున విప్లవ మిందనక తలసూపలేదు. దానికి కారణ మేమనుదురు? ఆహారము, అస్త్ర శస్త్రములు, రహదారులు తుదకా సంస్థాన సర్వస్వము నాంగ్లేయుల కర్పింప బడుచున్నవి. దాని అభిప్రాయ మేమై

యుండును? ఇదంతయు నతని కుతంత్ర సాధనా సామర్థ్యమును కదా చాటునది!

అతని సైన్యము సర్వసన్నద్ధమై యుండదని మీ అభిప్రాయము. అందులకే అతడు కాల విలంబన సేయుచున్నా డని కూడ మీ విశ్వాసము.

మాల్వీ: ఔను. అట్లేల కారాదు?

అమర: ఆ అభిప్రాయము ప్రమాద జనితము. అయోధ్య అగ్ని మధ్యమున నున్నదని అతనికి తెలియదా? షహాజహాన్ పురమును సర్. కాలిన్ స్మశాన మొనర్చినది అత డూహింపజాలడా? రోహిల్ ఖండము రుధిరవాహిని యౌట నతడు భావింపలేడా? ఇంతటి విలయతాండవము నాలోకించియు అతడు మిన్నకుంటకు హేతువేమి? అత డిందనుక మహారాణికి సానుభూతి సందేశము నేని పంపలేదే!

మాల్వీ: అవియే ఆతని యీ ఆకస్మిక పరిణామమునకు కారణము కారాదా అమర్!

అమర: ఆకస్మిక పరిణామములు శాశ్వతములు కావు అహమ్మద్! అతడు సమయోచిత వర్తనమున కలవడిన వాడు. విప్లవము విధ్వంసమౌనను శంకగాని, విజయవంతమౌనను విశ్వాసము గాని అతని కింతవరకు కలుగలేదు. అందులకే ప్రత్యక్షముగ నాత డెవరినిగాని బలపరచుట లేదు.

మాల్వీ: మరి యీ ఆహ్వానమున కంతరార్థము?

అమర: ఏమున్నది? నేటి ఫరంగీ విజయ మాతనికి కొంత ప్రోత్సాహ జనకముగ నుండియుండును. కాని, విప్లవ మహాగ్ని పర్వతమే ముహూర్తమున తనను కూడ కబళించునోయను శంక వానిని వీడలేదు. అందులకే తుది ముహూర్తమువరకును అటిడు వేచియుండ నిశ్చయించుకొని యున్నాడును.

మనల నెదిర్చు టసాధ్యమని కూడ ఆతడెంచి యుండును. అది కారణముగ మిమ్ము బంధించుట కిదొక మాయోపాయము. దీని ఫలితము ఫరంగీ పాలకులతో ఆతనికి గల మైత్రి దృఢతర మౌట. ఏబదివేల రూప్యము లాతని స్వంత ఖజానాను చేరుట.

మాల్వీ: భారతమున నింతటి స్వార్థపరు లుండిరా అమర్!

(వార్తాహరుని ప్రవేశం)

వార్తా: ప్రయాణ సన్నాహములు పూర్తియైనవి ప్రభూ!

మాల్వీ: అమర్! మా ప్రయాణము కొనసాగి తీరవలసినదే! అతడు వంచనము నెంచె నని కదా నీ అనుమానము! దానిని విచ్ఛిన్న మొనర్పగల సాధన సామగ్రితోనే మనము సాగిపోదుము. అమర్! మా అంగరక్షక దళమునకు తోడుగ మరొక అశ్వీక దళమును సన్నద్ధ మొనర్పుము.

(అమర్ నిష్క్రమణ)

మాల్వీ: జగన్నాథ్! ఎంతటి మాయోపాయము నెన్నితివి? ఈ మాల్వీ అహమ్మద్‌షాను వంచించుట సాధ్యమనియా నీ తలంపు? కానిమ్ము. నీవంచనమునకు ఝడిసి యీ అహమ్మద్‌షా ఆహ్వానమును త్రోసిపుచ్చడు. ఈ తనిలో ప్రజ్వలించు విప్లవ దవానలమున నీవు ఆహుతి యౌటయో లేక పరితప్త హృదయుడ వౌటయో తేలిపోవలెను.

ఆంగ్లులకు నే నసాధ్యమైనట్టి కృతికి
పూనితి వటోయి! లజ్జా విహీన మతివి?
ద్రోహమున మాతృ మూర్తినే దునుమ నెంచు
ధీమణీ! వేగ ఫలము నందెదవు లెమ్ము!!

—నిష్క్రమణ—

**తృతీయాంకం** **ద్వితీయ రంగం**

[వన ప్రదేశంలో కుమారసింహుడు]

ఆంగ్ల యోధాగ్రేసరులారా!

"ఆజమ్‌ఘరు"ను చేరు నందకు- "మిల్మను"
ప్రాణాలపై ఆస వదల నేల?
"ఘాజీపురా"న మా గర్జనల్ వినుదనకు-
"లాగార్డు" మత్తు దొరంగ డేల?
"శివపుర ఘట్టముం" జేరిన 'గోరిలా'
నెరిగి "డగ్లసు" పోరు నీయ డేల?
"జగదీశ పురము పచ్చని బావుటా నెంచి
"లీగ్రాండు" రుధిర మర్పింపనేల?

ప్రథనమున గెల్చియును శాంతి బడయ రేల?
సాహసించియు మము బట్ట జాల రేల?
భీరులను గూల్చి, వీరుల వెన్ను చరచు
విక్రమము మీదిరా ఆంగ్ల వీరులార!!

జగదీశ పుర ప్రాసాదమున శయనించుట కని మాతృభూమి కెగ్గు తలచుటయా? ఐనను దౌర్జన్యమున ఆక్రమించిన నా రాజ్యమును మీరు నాకు ప్రసాదించుట యేమి? ఈ కుమార సింహుడు వీరుడే నైన మిమ్ము సాధించి తీరును. ఆత్మ రుధిరతర్పణమున నేని ప్రాజ్యరాజ్యమును పొందితీరును.

(ఫిరంగుల మ్రోత)

ఏమి; యీ శతఘ్నీ నినాదము! (ఆలకించి) ఈ వీరకిశోర సింహుని విపిన మధ్యమున నెదిర్చుట కా ఫరంగీలు నిశ్చయించిరి కాబోలు. పాపము, ఎచటనో జనించిన ఆ శ్వేతముఖుల కీ విపినాంతరస్థలము స్మశాన వాటి కానున్నది.

(సేనాపతి ప్రవేశం)

సేనా: ప్రభూ!

కుమార్: జీవన్!

సేనా: మూడు పెద్దపటాలములు గోచరించిన వని చారులు తెచ్చిన వార్త ప్రభూ!

కుమార్: జీవన్! ఈ దుర్గమారణ్యము ఆ ఫరంగీల కభేద్యము. ప్రత్యక్ష పోరాటమున వారిని ప్రతిఘటింప గల సైన్యము మనకు లేక పోవచ్చును. కాని, యీ స్థలముననే మనము వారి నందర బరి మార్పగలము. ఏమందువు?

సేనా: తమ ఆజ్ఞ ప్రభూ!

కుమార్: మనస్థావరము ఆ ఫరంగీల కిపుడు తెలియరాదు. చెట్టున కొకరు పుట్టకొకరునై మన సైన్య మీ ప్రదేశ మంతటను విజృంభింపవలెను. వనమధ్యమున శత్రువు ప్రవేశించిన వెనుక మన పోరాటము ప్రారంభ మగును. నలువంకల మనసైన్యము చుట్టు ముట్టిన మీదట ప్రప్రథమమున మా ఫిరంగీ ధ్వానము మీకు సమరారంభమును సూచించును. ఈ కారడవిలో అతని కది హృదయభేద్యము కాకమానదు. అనంతరము ఉత్తరము నుండి మన తుపాకులు ప్రేలును. అత డటుగా గమించుట తెలిసికొని దక్షిణ పశ్చిమ దిశలు యేకకాలమున గుండ్లవర్షము గురిపించును. దానితో ఆతడు తూర్పుదెస పర్విడును. అతని కచట ఆశ్రయము భగీరథీమాత మాత్రము. మే మీ లోపున నది, కావలిగట్టున చేరెదము. మూడు దిక్కులనుండి మీరు, నదీ మధ్యమున శత్రువు, ఆవలి గట్టున మేము. గ్రహించితిరా!

సేనా: తమ ఆజ్ఞ ప్రభూ!

(సేనాపతి శంఖము పూరించి. నిష్క్రమించును.)

కుమార్: తల్లీ ... భగీరథీ!

నా సర్వస్వము నీవు. ఈ ప్రాణములు నీయవి ... రాజ్యమేనాడో అరుల పాలైనది. ఆలుబిడ్డ లడవులబట్టిరి. శ్వేతజాతి కల్పించిన

గాయ మేని కన్పడరాదని యీ నా వామహస్తమును కూడ ఖండించి నా చిరుకానికగ నీకు సమర్పించు కొంటిని. తల్లీ....! నా ఆశయము సువిదితము. నాప్రాణవాయువు లిక నే ముహూర్త మున నైన నను త్యజింప వచ్చును. నా వాంఛితము నీడేర్చు మమ్మా! నీయురమున నటించు ఆ ఫరంగీలను నీవే పాతాళమున కనుపవలె నమ్మా! మాతా...! నీ కిదే నా తుది నమస్కారము!!

(శంఖారావము. "హరహరమహాదేవ్" అను నినాదము. అది వినిన కుమారసింహుని నిష్క్రమణ)

## తృతీయాంకం తృతీయరంగం

[కారాగారంలో బహదుర్ షా]

బహా: ... భక్తఖాన్! నీ మేధాసంపత్తిని శంకించిన దాని ఫలమును భారత సామ్రాట్టు నే డనుభవించు చున్నాడు. స్వాతంత్ర్య సమర నేతృత్వమును వహించి, వీర భారతమును శత్రునిర్ముక్త మొనర్చి, స్వధర్మ ప్రతిష్ఠాపన సల్పి యశశ్శరీరు డౌటకు మారు యీ పాదుషా దాశ్యమునే వరించి, ఫరంగీ పాదముల నాశ్రయించి ధర్మచ్యుతి నంది నే డీ కారాగారము చేరినాడు. సేనాపతీ! మా దుర్బల హృదయము క్షంతవ్యము కాదు. పవిత్ర భారతమున జన్మించియు పశు ప్రాయులమై చరించి తిమి. మొఘల్ వంగడమునే గాదు, భూనాధ శ్రేణినే కళంకిత మొనర్చితిమి.

భక్తఖాన్! మా నిర్ణయమును గ్రహించి నీవే మము తుద ముట్టించిన నెంత బాగుండెడిది? మా రుధిరమును నీ పవిత్ర ఖడ్గరాజము స్పృశించుటకే నిచ్చగింపదు కాబోలు! జీవితాశ నశించినది భక్తఖాన్! మాకిక ముక్తిలేదు. ఏ క్షణముననైన మా హృదయము వ్రయ్యలై పోవచ్చును; కాని, అది అసం భవము. తత్క్షణ మరణము మముబోంట్లకు దుర్లభము. హృద

యము చివికి జీర్ణించిన గాని మా పాపము పరిహారము కాదు. విధి బలీయము...భక్తఖాన్!

[ఒక సిపాయి ప్రవేశించును. అతని చేతిలో నొక పళ్లెర ముండును. దాని నతడు బహదుర్ షా కందీయబోవును.]

సిపాయి: (అందీయబోతూ) జహాపనా!

బహా: ... ఏమది...?

సిపాయి: కెప్టెన్ హడ్సన్ తమ కీ ఫలములను...

బహా: బ్రతికియు చచ్చియున్న భారత సామ్రాట్టును పరాభవించుట కంతము లేదు కాబోలు......!

సిపాయి: ఇవి... వారి తోటలో... పండినవట జహాపనా!

బహా: ... ఎంతటి సహృదయుడు...?

సిపాయి: ... వీనిని తాము స్వీకరించి తీరవలెనట జహాపనా!

బహా: ఇయ్యది వాత్సల్య ప్రకటనమా... లేక బలాత్కారమా ...? ఏమైనను మా కీ తరుణమున ఫలాహారము రుచింపదు.

సిపాయి: జహాపనా! తమరు స్వీకరింపక తప్పదట!

బహా: ఏమి యీ దౌర్జన్యము? ఐనను వారి కత్తికి అడ్డేమున్నది? వారు సలుపు మారణహోమమునకు న్యాయాన్యాయ విచక్షణాజ్ఞాన మెందుకలదు? వారి మాట కాదనుట యేనా యీ బహదుర్ షా కారాగారవాసమునకు మూలము? వారి ధార్మికప్రవృత్తిని గ్రహింపకుంటయేనా యీపవిత్ర భారతము రుధిరస్నానమొనర్చుటకు కారణము? ఇదంతయు ఐంద్ర జాలికము వలె నున్నదే!

సిపాయి: ...... జహాపనా!

(స్వీకరింపు డన్నట్లు చూచును)

బహా: ... బద్మాష్...! ఆ ఫరంగీ ప్రసాదమును భారతసామ్రాట్టు స్వీకరింపవలెనను భీరుడవు వీరభారతమున నెట్లు జన్మించితివి?

(సిపాయి వణికి పోతూ ఉంటాడు)

పోవేమి…?

[కత్తి తీయును. సిపాయి కంపితుడై పళ్ళెరమును క్రిందపడ వేయును. పళ్లెరమునుండి మూడు తెగినతలలు క్రిందదొర్లును. బహద్దర్‌షా చకితుడై వానిని తిలకించి పరిశీలించి "బేటా" "ఖుదా" అని నేలకొరుగుచుండును.]

సిపా: …… అల్లా ……!!

(అంటూనే బహదుర్‌షాను పట్టుకొనును.)

[కల్పీ లో పీష్వా రావుసాహెబ్ గుడారం. రావుసాహెబ్ బాలా సాహెబ్‌ల సమాలోచన]

**బాలా:** ... మన బహు నాయకత్వమే 'చబేలీ'ని అగ్నిగుండమున ద్రోసినది. ఆమె సాహసము, చిత్తస్థైర్యము, సమరకేళీ పాండిత్యము, త్యాగము సర్వమును మన స్వాభిమాన కాననమున నిష్ఫల కౌముది యై చున్నవి. బాందా, షహాఘర్, బనపుర నరేంద్రులు రావుసాహెబు బాలాసాహెబుల నాయకత్వమున కేంద్రీకరింప బడియు 'కచగాన్' రంగమున పరాజితులైరను దుర్యశము నిలచి పోగలదు. మన 'చబేలి'యే కార్య రంగమున కురుకని ఏో పరాజయమే కాదు పీష్వాల ప్రతిష్టా ప్రాసాదము యేనాడో విధ్వస్థమై యుండెడిది.
సర్. హ్యగ్. రోజ్ కనుగప్పి కాల్పిచేరిన 'చబేలి' విశ్రమించిన దెక్కడ? క్రమ శిక్షణ నెరుగని మన సైన్యమును కూడదీసిన దెక్కడ? కచగాన్ కదన రంగమును చేరి వేటుపడిన సింగమై లంఘించిన రోజ్ సేనానిని ప్రతిఘటింప పర్విడిన దెక్కడ? సర్వము నొక క్షణమాత్రమున జరిగినవే!

**రావు:** (సాలోచనముగ) చారులు తెచ్చిన విశేషము లేమి?

**బాలా:** ... మన సైన్యము తిరోగమించుట అత్యద్భుతమని· ఆ శిక్షణము ను కదన రంగముననే వారు ప్రదర్శించిన ఆంగ్ల సైన్యము నిశ్శేషమై యుండెడి దని.

**రావు:** ...... తాతియా అభిప్రాయము... ?

**బాలా:** అతని జాడ తెలిసినగదా అభిప్రాయము నెరుంగ నౌట!

**రావు:** (సాశ్చర్యముగ) ఏమి...? అతడు...

**బాలా:** అతడు పరాజయమును శంకించి 'చర్ఖీ' దెస పర్విడి నాడని వదంతి.

**రావు:** ...... మన "చబేలీ" వృత్తాంతము... ?

బాలా: ఆమె ప్రస్తుతము యమునా తీరమున విడిసినదట. ఫరంగీ వినాశ నమును పరికించి గాని విశ్రాంతి నందమని సైన్యముచే శపథము చేయించినదట. ఈ నాటి సమరమున ఫరంగీ పతాక కవ యశస్సును, పీష్వాల భర్మ్య హర్మ్య పంక్తికి గౌరవాలంకృతియు తథ్యమట.

(చారుడు ప్రవేశించును)

చారుడు: శ్రీమంత్ పీష్వా ప్రభువులకు జయము!

బాలా: ఏమి విశేషములు?

చారు: కాళిందీ తీరమున నున్న మనసేనతో ఫరంగీ పటాలము హఠాత్తుగ తలపడినది ప్రభూ! ఝాన్సీ రుధిరసైన్యము కానిపించిన శత్రువు నెల్ల ఖండించినది. ఫరంగీ ఫిరంగుల గర్జన క్షణములో క్షీణించినది. శాత్రవుల అశ్వికదళము, పదాతివర్గము పలాయనమైనవి. కాని, కనుతెరచులోపల యెచటినుండియో ఒంటెల దళ మొకటి శరవేగమున చేరి త్రిముఖముగ దాడి సాగించినది; ప్రభూ!

రావు: మహారాణికి క్షేమమే కదూ!

చారు: మెరుపులా ఆ మహాతల్లి కదన రంగాన్ని కంపింప చేస్తున్నారు ప్రభూ!

రావు: బాలాజీ! అశ్విక దళాధిపత్యమును వహించి మీ రీ ముహూర్తముననే ఘంటా పథమున తరలి పోవుట సమంజసము. గజ పదాతి వర్గముతో మేము మరొక దెసనుండి ఆ ఫరంగీల కలచ యత్నింతుము.

బాలా: మంచిది!

(నిష్క్రమించుచుండును. ఏదో ఆలోచిస్తూ రావు సాహెబ్ అటే చూచుచుండును.— తెరపడును)

## చతుర్థాంకం ద్వితీయరంగం

[గోపాలపురమున ఝాన్సీ మహారాణి లక్ష్మి; ఒక గుడారంలో]

రాణి: తల్లీ!

ననుప్రేమించిన ఝాన్సికూలినది, మాన ప్రాణముల్ నేనుగా
మను నా వీరకుమార శేఖరులునున్ మసైనర, పీష్వాల కా
ల్పిని కాల్వెట్టితి దగ్ధమైన దది; తల్లీ! ఇంక నేరీతి నీ
జని ధన్యమ్మవు? ప్రాణనాధునకు తోషమ్మెట్లు చేకూరెడిన్!

కాల్పి కదన రంగము శత్రు హస్త గత మైనది. మాకు గల ఆ
ఆశ్రయ మొకటియు అరుల పాలైనది. పీష్వాల వంశ మిక నే వ
నాంతరముల విహరింప వలెను? మా ఝాన్సీ సింహాసనమును
తిరిగి పొందగల మార్గమెద్ది? పౌరుష స్వరూపము మా
తాతియా నే డెచట నున్నాడు? అతనిగూర్చి మాకు దూర
మొనర్చితివా తల్లీ?

తాతియ తోడు కల్గు నెడ ధర్మరణమ్మున శత్రువాహినిన్
పాతర వేసి యుండెదను, ఫల్గుణు డాతడు కానరా డేటే
దూతన లాతనిన్ బిలుకు మార్చుచు నున్నవు? కన్నతల్లీ!మా
చేతము పొంగ వాని మము జేర్పవె? తీర్పవె, ఖడ్గదాహమున్!!

(రావుసాహెబ్ ప్రవేశించును)

రావు: ... చబేలీ...!

రాణి: అన్నా!

రావు: (చిలిపిగా) తాతియా కొరకా నీ పరితాపము?

రాణి: ఔను! మన కెంతకాల మీ గోపాలపుర నివాసము? మన
కృపాణముల కెంతకాల మీ క్షుధార్తి? పీష్వాల నేటి అగచా
ట్లను తాతియా గ్రహించు నెడ సహించువాడా యని...!

రావు... విధి బలీయ మైనపుడు తాతియా మాత్ర మేమి చేయగలడు
చబేలీ! తంత్రిని దర్శించుమిమతో ప్రాణరక్షణకై పర్వతీయ
గలడు!

రాణి: (క్రోధంతో) అన్నా...! పీష్వాల మహా సేనానికే ద్రోహ మొనర్చు చుంటివి! తాతియా రణరంగమును విడిచి పారునంతటి భీరువు కాదన్నా!

(తాతియా ప్రవేశించి అదివిని మందహాసము చేయును)

రావు: ఐనను నేను మా మాట వినువా రెవ్వరు? మహారాణులు మహా సేనానులను స్వయముగనే ప్రశ్నింపవచ్చును.

(తాతియా ముందుకువచ్చి ఝాన్సీరాణికి నమస్కరించును)

రాణి: (సాశ్చర్యముగ) తాతియా!

తాతియా: (వినయముగ) మహారాణీ!

(రావుసాహెబ్‌లో మందహాసం)

రాణి: మా కృపాణముల కాహారము కల్పించితి ననుకొందును!

తాతియా: (మందహాసంతో) అంతటి అదృష్టము లభింపలేదు మహారాణీ! కాని ప్రస్తుతమునకు విశ్రాంతి సమకూర్చ గల్గితిని.

రాణి: (రావుసాహెబ్ దిక్కు) అన్నా! ఇది బ్రహ్మావర్త రాజ ప్రాసాదము గాదు; 'చబేలీ' నాడించుటకు!

రావు: (మందహాసంతో) తాతియా పలుకునది యథార్థము 'చబేలీ'! కాల్పి పతనమును శంకించిన మేము గ్వాలియర్ సాయమర్థించుచు నొక జాబును వ్రాసితిమి. అను క్షణమును అచటినుండి సమాధానము వచ్చునని నిరీక్షించు చుంటిమి. మనజాబుగని సింధియా ఉగ్రుడై నాడట. మనలను సమరమునకే కలిసికొన సమకట్టి నాడట. పాపము; మన తాతియా ఆతని సైన్యము నంతను విప్లవోన్ముఖ మొనర్చుట నాత డెరుగడు. (తాతియా దిక్కు) తాతియా...! అచటి సేనాపతు లేమని బాస చేసిరి?

తాతియా: "ప్రజా వాంఛితమును మన్నింపని సింధియాను ప్రజ మన్నింప" దని. "పీష్వాల విప్లవ పతాక గోచరించిన జాలు ఫరంగీ పతాక దింపి వేయుదు"మని.

రాణి: (ఉత్సాహంతో) ధన్యుడవు తాతియా!

తాతియా: (సవినయంగా) తమ అనుగ్రహము మహారాణీ!

-తెరపడును-

## చతుర్థాంకం — తృతీయ రంగం

[విప్లవ కారుడు ప్రజ నుద్దేశిస్తూ ప్రవేశించును]

విప్లవ రసోజ్వలమ్ము మాల్వ శిరమ్ము
నేల కూలెను; ద్రోహుల పాలబడుట;
వీరసింహము ప్రథిత కుమారసింహు
డసువులంబాసె; వీరశయ్యను రహించి;
వారి యాత్మలు శాంతిల వలె నటన్న
భారతము దాశ్యమును వీడ వలె నటన్న
తాంతవింపుడు విప్లవ ధ్వజము నెత్తి
ద్రోహుల వధింప; "ఘోరల" గొంతులను త్రుంప!!

## చతుర్థాంకం — చతుర్థరంగం

[గ్వాలియర్ రాజ ప్రాసాదమున ఝూన్సీ మహారాణి లక్ష్మీబాయి]

రాణి: ఎంతటి పరాభవము? మహాదాజీ పవిత్రాశీర్వాద లబ్ధమైన గ్వాలియర్ సింహాసనమునకే యిది ఘోరావమానము. ...! స్వాతంత్ర్య సమర హోమమున నింధన మాటకు మారు దాశ్య శృంఖలములను తనకు తానై బిగించికొనుట భారత మేధస్సునకే అగ్రాహ్యము.

జయాజీ! నీ జీవితాశయము సిద్ధించినది. లజ్జాకరమైనను నీ మనుగడ యిక నిరంతర భోగభాగ్యముల కాస్పదము కావచ్చును. అడవి ప్రమానువలె నీ విక చిరజీవివై వర్ధిలవచ్చును. నీ ప్రజ నీనుండి వాంఛించిన దేమి? సోదర నరేంద్రులు నిను సంప్రార్థించిన దేమని? తుదకు నీ సల్పిన మహాత్కార్యమెయ్యది?

ఆ ఫరంగీలకు నీ వనిన నెంతటి వాత్సల్యము; నీ వర్ధించుటయే తడవుగ సాయమంపిన వారి హృదయ మెంత కరుణా రసార్ద్రము? నిన్ను తిరిగి గ్వాలియర్ సింహాసనాధిష్ఠితు నొనర్చుటకే గావలె వారు నేడు మాపై కత్తిదూసినది? ...జయాజీ! ఎంతటి అమాయకుడవు? మహదాజీ దైన పవిత్ర రక్తము నీలో ప్రవహించుట లేదా! ఆ రక్తకణములు నీలోని దాశ్యమును ప్రతిఘటించుట లేదా? ...ప్రజలదైన సింహాసనమును ప్రజా కంటకుడవు నీ వా బలిమిమై పొందజూచుట?

[తాతియా ప్రవేశించును]

**తాతియా:** మహారాణీ!

**రాణి:** తాతియా...!

**తాతియా:** ...పరిస్థితి విషమించిన దమ్మా! శ్రీమంత్ పీష్వాలనే నిరాశా జీమూతము లావరించినవి. బాందా నబాబు శ్రీమంత్ రావు సాహెబులకు సమరమును సాగించుటలోని వ్యర్థతను విశదీకరించు చున్నాడు. మోరార్ పటాలము చిందర వందరయైనది. వెన్ను చూపనున్న జనరల్ స్మిత్ నకు తోడుగ సర్. హాగ్. రోజ్. అదనపు బలముల సేకరించుకొని సమరాంగణమును చేరినాడు.

**రాణి:** (సాలోచనముగ) గ్వాలియర్ పటాలము లెట్లున్నవి... ?

**తాతియా:** వారి రాజభక్తి ప్రశంసార్హము మహారాణీ! కదన రంగమున సింధియా కనిపించుట వారి కలవరమునకు కారణమైనది. కాని, సింధియా ఆంగ్లేయుల గూడి వచ్చుట లోగల అంతరార్థమును వారికి బోధించి కార్యోన్ముఖుల నొనర్చుట కష్ట మనిపింపలేదు.

**రాణి:** ప్రస్తుత మాంగ్లసైన్యములు కేంద్రీకృతమైన దెచ్చట?

**తాతియా:** ఆంగ్లసైన్యమున నర్థము తూర్పుద్వారమును చేరినది మహారాణీ! "కోటకీ సరాయి" పరిసరముల నున్న దుర్గము లాంగ్ల సేనాపతి దృష్టి నాకర్షించినవి.

రాణి: శ్రీమంత్ పీష్వాల అభిప్రాయము?

తాతియా: ... "ఝాన్సీ మహారాణితో సంప్రదింపు" మని వారి ఆజ్ఞ మహారాణీ!

రాణి: (అటు నిటు తిరుగుతూ...గంభీరముగ) ...సేనాపతీ...! సంప్రదింపుల కిది సమయము కాదు. శ్రీమంత్ పీష్వాలు స్వయముగ ముఖద్వార రక్షణ సల్పుట ఇప్పట్టున సమంజసము. బాందా నవాబు, బాలా సాహెబులు శ్రీమంత్ పీష్వాల ఆజ్ఞానువర్తులై మెలగుట భావ్యము. "కోట సరాయి" ప్రాంత రక్షణ భారమును నేను వహింతును. దాని కనువగు సన్నాహము నిక తామును...

తాతియా: ఆజ్ఞ... మహారాణీ!

[నిష్క్రమించును. మరొక దెస నుండి మంథర మగవేషమున ప్రవేశించును]

రాణి: (పరధ్యానముగ) ... ఎవరది... ?

మంథర: (వంగి నమస్కరించి) తమ శ్రేయోభిలాషిని; మహారాణీ!

రాణి: రాకకు కారణము... ?

మంథర: (మందహాసంతో)... తమ కొరకు... సర్. హగ్. రోజ్ సైన్య సమేతుడై...

రాణి: (గొంతు గుర్తుపట్టి చిరునవ్వుతో) ... మంథరా...!

మంథర: (నవ్వుతూ ముందుకు వచ్చి) అమ్మా...!

రాణి: ఎచటికి కీ ప్రయాణ సన్నాహము...?

(మంథర మౌనము)

బాలరాజు లెచట...?

మంథర: మన కొక ఆమడ దూరమున శ్రీమంత్ పీష్వాల రావాసమున...!

రాణి: (ఆనందంతో) మంథరా . . . ఇక మనము . . .

మంధర: (దుస్తుల నందిస్తూ) . . . అందుకే నమ్మా . . . !

[మందహాసంతో రాణి స్వీకరిస్తుంది. మంధర ఆమె నలంకరింప జేస్తూ ఉంటుంది. తెర పడుతుంది]

## చతుర్థాంకం — పంచమరంగం

[తెరలో కల్లోలము. రంగస్థలమున నటు నిటు పారిపోవు సైన్యములు. అంతలో ఝూన్సీరాణి ప్రవేశము.]

రాణి: (కత్తిదూసి సైన్యమధ్యమున ప్రవేశించి) సోదరులారా నిలుడు! స్వార్థమునకు బలిగాకుడు! పారతంత్ర్యమున బ్రదుకుటకన్న స్వాతంత్ర్య సమరమున మడియుటయే మేలు! పోరున జయింతురా స్వరాజ్యము నేలుకొందురు. ప్రాణము విడుతురా స్వర్గ సుఖ మనుభవింతురు! కరవాల జీవనులారా! ప్రాణభీతిని బారి బ్రతికిన జీవి లేదు. కల్లోలము పరాజయ హేతువు నిలుడు...! నరుకుడు. . .! మాతృఋణము దీర్చికొనుడు! యశోమూర్తులు గండు. . . !! ఫరంగీలు కల్పించిన పరాభవమును ఫరంగీల రుధిరముననే కడిగి వేయుడు. . . . !!

[తిరిగి సైన్య మంతయు చేరును. శంఖారావములు, నగారా మ్రోతలు, భేరీ ధ్వానములు మిన్నుముట్టును.. తెర పడును.]

## చతుర్థాంకం — షష్ఠరంగం

(ఆంగ్లేయుల జయ జయధ్వానాలు. సర్. హగ్. రోజ్ ప్రవేశము)

రోజ్: రష్ ఆన్ బాబ్ లోగ్! పర్స్యూ దిక్వీన్! కాప్చర్ హర్! కిల్ హర్; యిఫ్ నీడ్ బి! మూవ్ ఆన్! మూవ్ ఆన్; యిన్ ఆల్ డైరెక్షన్సు! లీవ్ నాట్ ది ప్రిన్సు! కిల్ హిమ్ టూ! టార్చర్ దెమ్!...రష్ ఆన్...!!!

## చతుర్థాంకం — సప్తమరంగం

(తుపాకుల ప్రేలుడు. సైన్యములు పరుగులు తీస్తున్నధ్వని, ఒక గుండు మంధరకు తగులును. ఆమె పడిపోవును.)

మంధర: (పడిపోతూ) అమ్మా...! అమ్మా...!!

రాణి: (ప్రవేశించి) మంధరా...!

మంధర: ...అమ్మా...! తుది నమస్కారము! అమ్మా! అమ్మా!

(రాణి ఒడిలో కూలిపోవును. రాణి విచార సూచకముగ శిరమువాల్చి, తలయెత్తి, కత్తి దూసి తరుముకొని వచ్చు సైన్యమును నిలువరించుచుండును.)

రాణి: ఆంగ్ల వీరులారా! మీ సైన్యములేల...? ఫిరంగులేల? రండు...! వీరధర్మ మెంచి ఖడ్గధారకు ఎదుర్పుడు!

నిలిచినది ఝాన్సి! వీరులు కలరయేని
శత్రుదాయుడు; రండు; మోక్షమ్ము గొనుడు!
దూరమున నుండి ప్రేల్చుట దోసమోయి!
శ్వేతముఖులార! విద్రోహ ఏవులార!!

(ఆలోచించి) భీరులారా! ఝాన్సి కరవాల మొసగు స్వాగతము స్వీకరింప నగు వీరుడే లేడా ఆంగ్లసేనావాహినిలో! నిస్సహాయ యగు మహారాణిని వధించుటకా మీ యీ విజృంభణము? రండు! ప్రాణములతో నీయమ మీకు దక్కుటసంభవము!

(గుఱ్ఱపుగిట్టల ధ్వని, సైన్యము మహారాణికి చేరువగ వచ్చును. దూరమున నుండి ఒక తుపాకీ గుండు వచ్చి రాణి హృదయమును దూసుకు పోవును.)

[బాధ నటించుచు] ఝాన్సీమాతా! నీ వీర పుత్రి నైన బలిదానము గ్రహింపు మమ్మా!

[మరొక తుపాకీ ప్రేలును]

## ఝాన్సీ రాణీ

మోసమున బుట్టి పెరిగిన ముష్కరుడవు
క్రూరుడా! వీరధర్మమ్ము కూల్చినావు!
ఝాన్సి కూలిన నేమి? శాశ్వతమటోయి?
భారతము నీకు; ప్రక్కలో బాకు గాక!!

ప్రభూ! ప్రభూ! స్వాతంత్ర్య పతాకము. ..! ఝాన్సీ సిం సనము ..! (పడిపోబోతూ) ... దామోదరా ...! ఝా ప్రతిష్ట నిక నీవే పునరుద్ధరింపవలె తండ్రీ ...! మా త కోర్కను తీర్చవలె బాబూ! ఝాన్సీ మాతా... మాతా

(పడిపోతుంది. ధోరా ప్రవేశించి వికటాట్టహాసం చేస్తాడు

తెనాలి భారతీ ప్రెస్‌నందు ముద్రింపబడియె. 1-1-1949.

